Sujanaranjani Series No. 7

# MALATIVASANTAM

## A DRAMA IN FIVE ACTS

BY

T. VENKATACHALAM B. A.



COCANADA:
Printed and Published by the Proprietor P. Brahmananda Row
at the Sujanaranjani Press, 1899.

# పీఠిక.

విద్వత్కవివరేణ్యులారా! మాన్యులారా!

చిన్ననాటనుండియు నాకుఁగల యాంధ్రభాషాభిరుచిచేత నేనభ్యసించుచున్న యాంగ్లేయభాషయైనను గొంతకాలమాంధ్రమునకిచ్చి రానురానుకవితారచన కించుకఁదొడఁగి కడకుసాహసముతో ఆ 1895 వ సంవత్సరమున శ్రీసీతాసుతవిలాసమను నొకనాటకమును సుగుణమణీపరిణయంబను నొకవచనకావ్యమును వ్రాసినాఁడను. పిదప ఆ 1897 వ సం॥న బట్టపరీక్షా కృతార్థుండనయి యింకొక శృంగారరసప్రధాననాటకము రచింపవలెనను కుతూహలమున నమకట్టి యీ శ్రీ మాలతీవసంతము రచించినాఁడను దీనికథాకల్పనయందు నాంగ్లేయమహాకవియగు షేక్స్పియరుదగు "సైమ్బెలిను" అను నాటకరాజము నక్కడక్కడ ననుసరించి వ్రాసితిని. పాఠకులెల్లరకు నాకథయంతయుఁ దిప్పివేయఁబడెనని సూచించినను విమర్శకులకుఁ గథాసూత్రము రెంటికి నొక్కటియేయని తోఁపఁగలదు. ఇందలికథ పూర్వనాటకానుసారముగను హిందూజనహృదయరంజకముగను గూర్చి వ్రాయఁబడినది ఎటులనఁ జంద్రసేనుఁడను వంగదేశాధిపతి సోదరామాత్యాదిసహితుండై పరదేశముపైదాడివెడలి సమరదిగ్విజయముగొని స్వపురమునకు మరలుచుండ నిదివరకుదనిచే రాజ్యభ్రష్టుఁడుగాఁ జేయఁబడి మంత్రవేత్తయునరణ్యవాసియునైయున్న చిత్రకేతునృపతియొక్క మంత్రవిశేషములకుఁ గట్టువడి దారిలోనున్న యాతని యాశ్రమోపాంత భూములవేటాడఁ దలంపుగొని సురూపవసంతుఁడగు తనకుమారువసంతునిఁ గోలుపోయి తనపరివారములోఁ జెల్లాచెదరగుటయుఁ జిత్రకేతుని శిష్యుఁడగు సుముఖునిచేఁ దెప్పింపఁబడినవసంతకుమారునిఁ జిత్రకేతుఁడు మాలతలతోఁ పమాంగియగు మాలతీకన్య పూలతోటకు నిత్యౌర్జితనియమించుటయు వసంతునిజూచుటచే మాలతికి మోహాప్తిజాంకురములు నాటుకొనుటయు నాఁబూదోటలోనున్న యాతనిజూడఁగోరుటయు వారిరువురకుఁ బెక్కుతరగముల శృంగారరచనలు జరుగుటయు నిక్కడఁదనకుమారునిఁ వెదకివేసారి నిద్రించియున్న చంద్రసేనుని నాతని తమ్ముఁడును వృషసేనుఁడునుఁగలిసి చంపఁబూనుటయు నిట్టులనే పెక్కుకష్టములఁబడియుండు చంద్రసేనాదులుఁ దనమంత్రప్రభావముచే సుముఖునివలనఁ జిత్రకేతుఁడు సంక్షోభపెంపఁజేయుటయుఁ బిదపఁగేళీశాభవనమునందుఁ జతురంగమాడుచున్న మాలతీవసంతులను జూపివారి నానందింపఁజేసి కడులజ్జగొనియున్న వారిలనాదరించి యుభయసంతలు వారిశోకవిమోచనమగునట్లు మాలతీవసంతుల కాయాశ్రమవాటిని గాంధర్వవిధిగాఁ బెండ్లిజేసి స్వపురప్రవేశమొనరింపఁ జేయుటయు ననుకథ విజృంభించి వ్రాయఁబడినది. ఇందుశృంగారము ప్రధానాంగమైనను గరుణముగూడ నంగోరు వ్యాపించియుండును

శా॥ ఛందోబద్ధము గాకయున్న, గుణసంస్కారంబు లేకున్న, వా
గ్వ్యాదంబుల్ సరిపోవకున్న, మఱియేయేలోపమున్నన్ మహా
నందం బొప్పఁగ విప్రకులార ! దయతో నాతప్పులం దెల్పుఁడీ
కందః స్నేసహించుకొంచు నతులన్ గావించుకొందున్ సదా ! ॥.

స్వ నద్ద్రోణ్యు ఘగడః బాధఁ గాంచునతఁడు । జగతి వికృతిఁ గాంచఁ గాఁజాలినల్లు ।
ళానఁగ బటుంబుఁ బూనసమానపుండు । దప్పుగని యెంచునె తటియొప్పునైన॥

కాకినాడ
ది 20 యేప్రియల్ ౘ 1899 సం॥

ఇట్లు పండితవిధేయుఁడు,
తురగా వేంకటాచలము.

---

ఈ నాటకమునందువచ్చెడు పాత్రములు.

పురుషులు.

వసంతసేనుఁడు—కథానాయకుఁడు.
చంద్రసేనుఁడు—వసంతసేనుని తండ్రియు వంగదేశమహారాజును.
వీరసేనుఁడు—చంద్రసేనుని సోదరుఁడు
చిత్రకేతుఁడు—పూర్వము కళింగదేశమహారాజును నిపుడు విపినవాసియు మంత్రవేత్తయును.
వృషకేతుఁడు—చిత్రకేతుని సోదరుఁడును జంద్రసేనుని యాప్తుఁడును.
సుమంత్రి—చంద్రసేనునికి నిప్పటిమంత్రి యుఁబూర్వము చిత్రకేతునిమంత్రియు.
మైత్రేయుఁడు—చంద్రసేనుని యాశ్రితుఁడగు నొకబ్రాహ్మణుఁడు.
మైరేయుఁడు } —చంద్రసేనునిభటులు.
విలంబుఁడు }
సుముఖుఁడు—చిత్రకేతునివిధేయుఁడగుశిష్యుఁడు.
దుర్ముఖుఁడు—చిత్రకేతునకవిధేయుఁడగు శిష్యుఁడు.

స్త్రీలు.

మాలతి—కథానాయిక
కళావతి } —మాలతి చెలికత్తెలు.
మనోరమ }

---



# మాలతీవసంతము.

## ప్రస్తావన

### నాంది

శా॥ శ్రీరాజిల్లరుషారుదృష్టి సుతునిం జేపట్టి వ్యృద్ధోఖ్లిజపై
రేరా! యంచు యశోద దన్నడుగఁ దల్లీ! నీవెటుల్ నమ్మితీ
నోపంజాడుమటంచు సర్వభువనానూనానుభావంబులన్
దాదాళంబుగఁజూపు కృష్ణుఁడిడు గాతన్ మీకుఁ గళ్యాణముల్॥

సూత్రధారుఁడు — (నాందిముగియుతోడనే తెరవైపుజూచి) ప్రేయసీ! అలంకరణమైనచో ఇటులొకమారు రమ్ము.

నటి — (నృత్యముతోఁ బ్రవేశించి భర్తవంకఁదిరిగి) నాథా! ఏల నన్నుఁ బిలిచితిరి?

సూత్ర — సఖీ! అటుజూడుము. విద్వత్కవివరేణ్య ప్రవేశప్రాశస్త్యంబగు నీసభానివేశంబు జూడ నిన్నేలఁ బిలిచితినో నీకే గోచరముకాగలదు.

చ॥ అలరు మొగిళ్ళబులున్ వినెదు నాసల సూచన జేయు వీనులున్
నలువయిశ్రద్ధఁదోపు నయనంబులునన్ వరమానవృత్తియున్
గలిగిన యీ సభాసదులఁగావ్యరసజ్ఞులఁ గాంచుతోనె నేఁ
బలిపెడిదేమి నీకు సుదతీ! నవనాటక సంప్రయోగమున్॥

నటి — (హర్షముగా) అట్లయినచో నీమహామహుల సఫలీకృత మనోరథులనుగాఁ జేయఁదగు నాటకముఖ్యమెద్దియో తెలిపి యనుగ్రహింపుఁడు దానిని ప్రయోగింతముగాక.

సూత్ర — ప్రియా! మొనమొన్న శ్రీమాలతీ వసంతమను నొక నూతనాలంకారప్రబంధవధూటి నలంకరించెననుట వింటివా!

నటి — (సానందముగా) నాథా! వినకేమి. అదియే నాస్ఫురణకును వచ్చినది.
ఆనూతనాలంకృతిచే నాంధ్రవధూమణిని సంస్కరించినవారెవ్వరు ?

సూత్రి— సఖీ !

చ॥ విలసితకీర్తికాముఁడగు వేంకటమంత్రికి సూరమాంబకున్
గలిగెను బుత్రషట్కమిలఁ గన్నులపండువౌనర్చి ; వారిలోఁ
జెలఁగెను ఖ్యాతిమున్వడసి జ్యేష్ఠుఁడునై యలరారి వేంకటా
చలకవిసూరిపంగణముఁ బ్రజందనియించెడు సాధువర్తనన్॥

నటి— నాథా ! ఈకవివంశములో నెవ్వరైన విద్వత్కవులు వెలసిరా ?

సూత్రి— మనోహారిణీ ! నీవు వినలేదా !

ఉ॥ ఆశుకవిత్వ సంతత నిరంకుశ వేగవినిర్జితతార్క్ష్యది
వ్యాపగ సత్వగుండుఁ బృథులాంధ్రవధూ ప్రియవల్లభుండు బా
పాశుగపన్నగుండు తురగాన్వయ వార్ధిసుధాకరుండు స
ర్వేశ కృపానురక్తి విహరించె జగంబున రామనాముఁడై॥

నటి— నాథా ! అవును నేనే మరచితిని.

సూత్ర— కావున. గీ॥ ఈతఁడాతనివంశ సంజాతుఁడగుట
నబ్బదే లేశమైన సదాంధ్రరచన !
శుభ్రరసఫలపూరిత చూతమహిమ
యెక్కడే ! యంటు మామిడి మొక్కలకును॥

నటి— ప్రాణేశ్వరా ! నిశ్చయము. ఈకవి జన్మభూమి యెక్కడ !

సూత్ర— సఖీ !

ఉ॥ సారమహాగమార్థ గుణసంభృతమై వరగౌతమీ నదీ
తీరవిరాజమానమయి దివ్యవినాయక రాజధానియై
సూరివరేణ్య సంజనన శోభితమై సిరికిల్లు గాఁగ నా
ప్పారెడు నైనవల్లియె నివాసము నీతనికిన్ శుభాననా !

నటి— నాథా! అట్లయినచో నీకవి చరిత్ర నాకు మనోహరమ్ముగానున్నది. ఇఁక నీసభాస్తారుల మెప్పించుటెంత కార్యము!

సూత్ర— సఖి! అవును.

గీ॥ సన్నబియ్యంబులును స్వచ్ఛ శాకములునుఁ
బచనమొనరింపఁగల మంచి పాకినికిని
నెటులమనసొప్పఁ బరులకు నిడఁగ వానిఁ
దనకె యాస్వాదనీయమై తనుపకున్న!

ఇఁక నాలస్యమేల! ఈమహాజనముల మనములనతికట్టునట్లు మంగళ ఋతు గాన వినోదము నెఱపుము.

నటి— నాథా! ఏఋతువును గూర్చి!

సూత్ర— ప్రేయసీ! ఈనాటక నామము నీవు మరువనిచో నన్నట్టులడుగవు.

నటి— సఖా! పాత్రాలంకరణకృత్యమునందు మనసు దగిలియుండుటచే నిట్లడిగితిని గాని మీరు నెలవీయనక్కఱలేకనే నేను బ్రారంభించెదను.

సూత్ర— ఏదీ! చూతము.

నటి— సీ॥ రాజితప్రసవమరంద పానాసక్త నవ్యాళిరవము సోనాయిగాఁగ
పక్వభూమీరుహాఫల భోజ్యమాన సద్విజసూక్తిద్విజసూక్తివృత్తిగాఁగ
శ్రేణీప్రవర్ధిత చిత్రావనీరుహ పత్రాళి తోరణ పఙ్క్తిగాఁగ
సతతకేళిరత సంతోషితస్వాంత జంతుసంతతి బంధుసమితిగాఁగ

గీ॥ పత్తనోపాంతసీమా విభాసమాన
నవ్యకుసుమాకరంబులు నయనపర్వ
దీప్తిరాజిల్ల శ్రీమాలతీవసంత
పరిణయోత్సవమెల్లెడ జరగునిపుడు॥

సూత్ర— సఖీ! నీగాన కళా ప్రభావముచే సభాసదుల మనంబులనగణ్యముగా నరికట్టుబడినవని తలంచెదను.

ప్రథమాంకము.

గీ॥ సుందరీ! నీవమ్మృదుగాన శోభచేతఁ
జూడుగదుఁ జొక్కియున్నారు శ్రోతలెల్లఁ
జిత్రకేతుని మంత్రవిశేషములకుఁ
జంద్రసేనాది వైరిసంచయముఁబోలె॥

గాన నీవిఁకఁ బోయి యలంకృతమైన పాత్రలచే పరల నానందింపుము.

నటి— చిత్తము.

---

ఇతి ప్రస్తావన.

---



# హా॥ శ్రీవసంతము

---

## ప్రథమాంకము

---

రంగము— చిత్రకేతుని యాశ్రమారణ్యము.

(చంద్రసేనుఁడు, వీరసేనుఁడు, వృషకేతుఁడు, సుమంత్రి, వసంతుఁడు మరి కొందఱు భటులును ప్రవేశించుచున్నారు).

చంద్ర— (సహర్షముతో) సుమంత్రి! ఇటనాయెదుట నగ్గుడువారిని దప్ప దక్కిన విజయసేనను మనరాజధానికిఁ బొమ్మంటివా!

సుమం— రాజోత్తమా! పౌరులు సంగ్రామఫలితమునకై నిరీక్షించుచుందురని యట్లుచేసినాఁడను.

చంద్ర— సుమంత్రి! మంచిపనిచేసితివి. కావున,

మ॥ భుజదుర్దాంత విశేషవిక్రమ కళాపుణ్యంబునన్ శత్రుది
గ్విజయావాప్తి వహించి యంచిత మహావిఖ్యాతధౌరేయతన్
గజరాజాశ్వరథాతిసంఘములను నాకర్షించి నీప్రాపుచే
విజయంబొప్పెఁ జెలంగుటన్ వలతునే వేటాడనిచ్చోటునన్॥

సుమం— జనవరా!

మ॥ భవదీయామిత వత్సలత్వమున నాప్రాపందురేగాని నే
లవమైనంబొనరించినాఁడనె? మహోల్లాసంబుతో భేరికా
రవఘోరోద్ధత సంగరస్థలి భటుల్ రాజిల్లుటం గాక; మా
నవ నాథా! భవదాత్మభృత్యనిటులన్ మన్నింపగా నేటికిన్॥

చంద్ర— అమాత్యా! నీవినయ నయ భయంబులకును నీహితావహమృదుమధురోక్తులను నాయుల్లంబత్యానందంబునొందెడు. నీయట్టిమంత్రిపుంగవుండు నేటికిలభించుట మదీయ పూర్వజన్మసుకృతలేశంబునంగాదె! కావున మృగయావినోదకార్యకరత్వంబునకు వలయు సన్నాహంబుల గావింపఁజేసి నాదగు నింకొక్క కోర్కె దీర్పవలయును.

చ॥ విపులమృగేంద్రముఖ్య ఘనభీకరజంతుసమన్వితంబులౌ
విపినములంటఁ గొంత భటవీరచయంబు వసంతునొద్ద నా
దుపనువుగాఁగ నుండుమని తోడనె యానతియిమ్ము మారుతా
తపములఁ గుందకుండ సుఖదంబగు శాలరచింపఁజేయుమా॥

సుమం— రాజన్యమార్థన్యా! భవదాజ్ఞానుసరణంబుగా, వలయుసదుపాయంబులఁ గావింపఁజేసి యిటనున్నట్లు వచ్చెద నాకాజ్ఞయిండు.

చంద్ర— మంచిది వేగరమ్ము. (సుమంత్రి నిష్క్రమించుచున్నాఁడు)
మైత్రేయా! చూచితివా! బహుమృగ సంకులంబులగు నుగ్రారణ్యంబుల ధనుర్బాణ హస్తులమై వేటాడుచుండుట మాబోంట్లకుఁ బర్వదినము సుమా.

మైత్రే— రాజోత్తమా! వింటిరా! బహువిధభక్ష్యభరితంబులగు కదళీ పత్రంబులందు శుభోదక పూరితకలశంబుల నొద్దయుంచుకొని భుజించుచుండుట మాబోంట్లకుఁ బూర్ణపర్వదినము సుమా.

చంద్ర— (నవ్వుచు) నీకెప్పుడు గారెలు బూరెలుమీదనే మనసు బోవుచుండునేమోయి.

మైత్రే— (పకపక నవ్వుచు) మీకెప్పుడు పరరాష్ట్రాక్రమణముల యందును మృగయావినోదములయందును మనసు దగులుచుండ మాబాపనయ్యలకుఁ బరధనావన్యాక్రమణ మాయోపాయములయందు, భోజనక్రీడా లీలావిలాసములయందును నాశపుట్టును.

చంద్ర— (నవ్వుచు) నీమాటలకేమిగాని జాగ్రతగా నటునిటుపరికించుచుండుమా

మైత్రే— (పరికించుచు) రాజా! నాదేహము కంపమెత్తుచున్నది. సముద్రతరంగఘోషవలె నేదో వినవచ్చుచున్నది.

చంద్ర— (నవ్వుచు) మైత్రేయా! నీకేమియు భయములేదు, అదియొక శార్దూలకంఠధ్వని నీవు చూచుచుండఁగ దానినొక్కపెట్టున గూల్చెదను.

మైత్రే— (వడకుచు) నాయనా! నాతల్లికి నేనొక్కడనే సుమా?

చంద్ర— బ్రాహ్మణోత్తమా! నాప్రక్కదాగియుండుము. వృషకేతూ! సుమంత్రి యింకను రాఁడేమి!

వృష— (నిరీక్షించి) దేవా! ధనుర్బాణాదుల భటునిచేఁబట్టించుకొని యిటువచ్చుచున్నాఁడు.

(అంత సుమంత్రియు ధనుర్బాణాదులతో భటుడును బ్రవేశించుచున్నారు)

చంద్ర— సుమంత్రీ! నీతోఁడిది సంభాషించుటకుఁ గడువు లేదు. ధనుర్బాణాదుల వేగనిటు తెమ్ము-

శా॥ హాలాహాలముబోలుచొంగవివృతాస్యస్రావమై పొంగను
ద్వేలాఖిలఘనాంగమట్టి యురకల్ వేయంగ క్షుత్పీడమై
కాలప్రేరిత మృత్యుదేవత బలెఁ గాంక్షించి తీంద్రించి శా
ర్దూలంబొండెటులేగుదెంచెడు మహారోషాయితాక్షచ్ఛవిన్॥

కావునఁ దరుణంబ నాబాణానలంబున కాహుతి గావించెద. మీరలందఱు గూడ నాయుధపాణులై సిద్ధముగానుండుఁడు.

(అని బాణము బ్రయోగించుచున్నాఁడు.)

సుమం— రాజోత్తమా!

చ॥ అలఘుశరప్రయుక్తి నిశితాసినిఁగూలుకుజంబు భాతిఁదా
విలవిలఁదన్నికొంచు నతివేలభయంబున నాల్కఁజాచిచాం
గలవెడలించి దొలుఁచును గన్నులఁదేలఁగవైచి మించిగుం
డెలుదడఁగొట్టుకాడఁగఁబడెన్ ధరపై నురుఘోషజేయుచున్॥

చంద్ర— సుమంత్రీ! అట్టులైనచో దానికోరలు పెరికింప నాభటునంపుము.

సుమం— దేవా! చిత్తము. ఓరీ! నీవుపోయి రాజాజ్ఞను నిర్వర్తింపుము.

భటు— చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

చంద్ర— వీరసేనా! చూడుము. నడగొండవలె నేదియో దక్షిణాభిముఖమై వచ్చుచున్నది.

వీర— దేవరా! అదియొక గజరాజము. నేను దానిని సంహరించి మృగయావిహార కుతూహలమూపాదించుకొనెదనుగాక.

ద్ర— తమ్ముఁడా! గీ॥ బహుళశాఖోపనిర్మిత పాదపంబు
నూడగమితోడఁ దొండాన నూడఁబెఱికి

నోటఁగఱచుచుఁ దనకెదిసాటి లేని
లీల నేతెంచుచుండె శుండాలమిందు॥

కావున జాగ్రతగాఁ గృషిజేయుము.

వీర— స్వామీ! తనతొండము నతిచిత్రముగా నెత్తి విఱ్ఱవీగి నడుచుచున్నది చూచితిరా!

చంద్ర— తమ్ముఁడా! అది యెంతచిత్రంబుగానున్నదో వర్ణింపుము.

వీర— మ॥ అలినీలాలకలైన, వతులలమునన్ హళిక్ గురుత్వంబునన్
లలితౌన్నత్యగతిన్ జెలంగ, ననుబోలంగోరి యేనాటికో
యలవాటుంబడిరన్న యందమున నాయంగంబులన్ మీఱు వా
రిలనున్నారె యటంచుఁ బ్రశ్నయిడె నా శైత్రేన్ గరంబున్ బ్రభూ॥

వృష— స్వామీ! తనతోడిపిడియేనుఁగు లాక్రమింపఁ దనకెదుట నిర్మలోదకములచేఁ దళతళమెఱసెడు హ్రదరాజమునకు జలక్రీడకుఁగాబోలు గజనాయకుండరుగుదెంచెడిని.

చంద్ర— సోదరా! ఇదియె మంచి సమయము. నిర్లక్ష్యచిత్తుఁడై కామాంధతచేఁ గన్నుగానని యీగజరాజమును జంపినచోఁ దోడియేనుగులన్నియు నెమరువగ్గును. అప్పుడు మనమిచ్ఛావృత్తిగా వేటాడవచ్చును. అదిగో కమలాకరము జేరి వినోదించుచున్నాఁడు.

వీర— స్వామీ! అవును గాని

మ॥ అరవిందాకరబిందుసంచయాంశులన్ హస్తంబునంబీల్చి త
త్కరిణీయూథముపైని సాదరతఁ జక్రప్రక్రియన్ జల్లి చా
మరముల్ బోలెడికణముల్ విసరు సమ్మత్తేభవిక్రీడితం
బరయన్ హస్తము లెట్టులొర్చెడిని బాణాగ్నుల్ బయింబంపఁగన్॥

(అని బాణము వదలుచున్నాఁడు.)

చంద్ర— చబాష్! వీరసేనా! కడుమెప్పుపనిచేసితివి. తక్కినయేనుగులు చెల్లాచెదరై పోయినవి.

వృష— (ఆశ్చర్యావలోకనుఁడై) రాజవర్యా! చూచితివా! పోటుమగలందఱకు గాటంబగు మగంటిమిని జూప నేడదేమియో తండతండంబులుగాగూడి

ని నానావిధమృగంబులును దమలోని జాతివైరోద్ధ్యములుమాని పెండెంబు గట్టి దండుగొని యీదండనే తెంచుచున్నవి. ఇఁక మీమీ బలపరాక్రమంబుల నెఱప నేడు తఱియయ్యెడిఁగాచికొండు.

చంద్ర— (అమితానందముతో) వహ్వా! వృషకేతూ! వీరసేనా! ఈ దినమున ఘనపుణ్యమేమియోగాని దిగ్విజయమునకుఁ దోడుగా నీమృగహరణ వినోదము గూడ లభించినది.

వృష— (భయముతో) రాజన్యా! మీకంతసంతోషావహమగుచున్నది గాని భూమి యీనిన చందంబునఁ గుప్పలుకుప్పలుగా నుప్పతిల్లెడు నాజంతు సంతానములఁ జూడ నాకుదుర్భర సంతాపము గలుగుచున్నది.

చంద్ర—(పాఱఁజూచి) అవునోయి వృషకేతూ! ఏమి యీగుంపులు. సుమంత్రీ!

సీ॥ లీలమై శూలంబుఁ గేలసంకించుక యరసినఁగన్పడనట్టివ్రులులు
బాణబాణాసనప్రతతితో రోయంగ నేడకో పరువిడు నెలుఁగుబంట్లు
భల్లతోమర కుంతపటుసాధనంబుల వెనుకంగగుహలాను ద్వీప చయంబు
తతమంత్రతంత్రయంత్ర ప్రయోగంబుల జడిసిమూలల దాగుశరభకులము,

గీ॥ మందమందలుగూడి యమందతీవ్ర
రోషసంకీర్ణవక్త్రులై రుధిరరతిని
మనల్ఁగాంచియు నిర్భీతిమసలుచుండెఁ
జూచితే మంత్రివర్య! యీసాగసునేడు.

సుమం— (విన్నబాటుతో) రాజోత్తమా! అవును. దేవరవారు సెలవిచ్చిన వన్యయు ఘాతుక జంతువులు- వానికిఁ గ్రూరత్వము నైజగుణ మనుకొన్నను శాంత స్వరూపములగు నీలేడిపిల్లల ప్రభావముచూడగా నిదియేదియో మాయాద్భుతచర్యగాపన్నది.

చ॥ నరచరణధ్వనుల్ వినిన నాలుగుక్రోసులదూరమేగు నీ
హరిణచయంబుగాంచితె సఖా! నిశితప్రదరప్రయోగ జ
ర్ఝరిత ఘనాస్రదేహలయి చావక మోరలు మీదికెత్తి కా
వరమునఁ జెంగలించు సహవాసబలంబొ! చలంబొ! పీనికిఁ॥

(ఒక భటుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వృష— ఏమిరా! ఇది. ఇట్లురొజుకొని వచ్చుచున్నావు

భటు— నాయనా! నను మాట్లాడింపకుము. నాకూపిరి లేదు. ఏమిపులులయ్యో.

(తెరలోఁగలకలము)

ఉ॥ కొమ్ములఁ జిమ్మెడిన్; బదునుకోరలఁజీల్చెడిన్; మీఁదికేగి దే
హమ్ములఁ గ్రుమ్మెడిన్ గురుతరాగ్రహవృత్తిని వాయిఁజూపి జీ
వమ్ములఁ గ్రోలఁబోయెడి; నపారముగా భువి యీనినట్లు సం
ఘమ్ములఁ గూడివచ్చెడి; నకారణమాయువుమూడె మీకిటన్॥

చంద్ర— (రోదనములవిని) భటులారా! మృగయావిహారకుశలులారా! ఇది యేనా మీపౌరుషము!

ఉ॥ చక్కమెకంబు లేద! ఘనపౌరుషచిహ్నము లేద! వానిపెం
పెక్కనకొమ్ము లేద! మదహీన నిశాతకృపాణము లేద! మీ
రెక్కరణిన్ జనంగనగునే! యువియున్ విసుగొందిచిక్కమీ
రెక్కడికేగువారొ యట మృత్యువు లేదొ? స్థిరంబె జీవముల్!

(వినియు వినిపించుకొనక పులిచేత వెంబడింపఁబడుచు భటుఁడొకఁడు ప్రవేశించుచున్నాఁడు).

భటుఁడు— (రోదనముతో)

సీ॥ కానకకన్న నాసూనుభాషణములు కర్ణభూషణములై క్రాలవొక్కొ
(నిష్క్రమించుచున్నాఁడు.)

మఱియొకఁడు— (ఆక్రందనముతో)

పరిపక్వయౌవనప్రాప్తయై చెలువారు సుదతి కౌఁగిలి యింక సున్నయొక్కొ
(నిష్క్రమించుచున్నాఁడు)

మైత్రేయుఁడు— (ఏడ్చుచు) రాజా! ఇంతే! రక్షింపవు?

కడువృద్ధులయి యొక్క కబళంబు మెసఁగని తలిదండ్రులకు నాసతొలఁగునొక్కొ
(నిష్క్రమించుచున్నాఁడు)

మైత్రేయుఁడు— (నిట్టూర్పుతో)

సౌధవిహార సత్సౌఖ్యోపభోగంబులెల్లను నాకింక వెసఁగవొక్కొ
(నిష్క్రమించుచున్నాఁడు)

విలంబుఁడు— (కన్నీళ్ళతో) గీ॥ సేవకవ్యాపృతినిఁ గడుఁ జెమటలూడ్చి
రేఁబగళ్లను నిద్ర, మైరేయము డిగి
యేను గడియించినట్టి యహీనధనమ
నేటితో నంతరించుట నిక్కమొకొ॥
(నిష్క్రమించుచున్నాఁడు)

చంద్ర— (వివర్ణవదనుఁడై) సుమంత్రీ! ఏమి యీదురవస్థ! భీతియన్న మాటయే లేక యెన్ని వాఁడి ములుకులకు నోర్వక యీమృగములు మనలబాధించుచున్నవి

ఉ॥ వాఁడిశరంబులేసి పరువంబగు ఘోరమృగాళిఁగూల్చి యా
డాడను జిత్రజంతు నివహంబులఁబట్టు ముదంబునొంది వే
టాడఁగఁగోరినాఁడ నిట నంతియ కాని సుఖంబుపేడ వె
య్యేడులకైనఁ గోరుదునె యీవగలీ మృగయావినోదముల్!

సుమం— (సాధ్వసముతో) రాజోత్తమా! మనకు జీవములపై నాశ విడువవలసి వచ్చినట్టులున్నది. భటులఁ జెల్లాచెదరుగాఁ గొట్టి యిఁక మనల బాధించుటకై పంతముపట్టి యిటువచ్చుచున్నవి-
(తత్తరపడుచున్నారు)

చంద్ర— (అతివిషాదముతో)

చ॥ పురవరముఁ జనతీసమితిఁ బుత్రచయంబును మిత్రసంతతిన్
వరగృహముల్ బురోపవనభాగములున్ మృగయావినోద త
త్పరతఁ బరిత్యజించి యిటు పామరబుద్ధి వసిస్థలిన్ మృగో
త్కరముల నోటఁజిక్కితిమి దైవ వికల్పము లెట్టులున్నవో॥
(పారిపోవ యత్నించుచున్నారు)

సుమంత్రీ! పర్ణశాలలో వసంతకుమారుని రక్షింపుచుండుమంటిని గదా! అన్నా! అతనిమాట మరచితిని. నాపుణ్యధనమేమయ్యెనో గదా!

సుమం— (దుఃఖముతో) మహారాజా! యమభటులవలె వెనువెంటఁబడు మృగముల బారిబడక మనప్రాణములు గాపాడికొనినచోఁ బిదప నాతనిమాట జూడవచ్చును. ఏది యేమైన నిప్పుడు మనమేమి చేయఁగలము.

చంద్ర— (కన్నీళ్ళతో) హా కుమారా ! వసంతసేనా ! నాకన్నిటిభయముల నేడుగ డవనుకొనిన నిన్ను గోలుపోయితిని. (అందఱు నిష్క్రమించుచున్నారు)

---

ప్రదేశము ii. మున్యాశ్రమము.

(చిత్రకేతుఁడును, మాలతియుఁ బ్రవేశించుచున్నారు)

చిత్ర— మాలతీ! మనోరమా కళావతులతో నాడుకొనక యేమి యీదినమున జాలినొందుచున్నట్టులుంటివి !

మాల— ఆర్యా ! ఏలనో గాని యపూర్వధ్వనులు కొన్ని నాశ్రోత్రపుటంబులం బడి నాకనంతవిచారము పుట్టించి యింకను వినఁబడుచున్నట్టులేయున్నవి.

చిత్ర— బిడ్డా ! ధ్వనులను వినుటయేనా ! కనుల నేమైనఁ గనుగొంటివా !

మాలి— పూజ్యా ! అంతయేకాదు. ఎప్పుడు నేఁగాంచని కొన్ని స్వరూపములు నా కంటఁబడి నాకనంతము దావహములయ్యెను.

చిత్ర— కుమారీ ! అట్లయినచో నీకుఁగష్టసుఖములు రెండు నేకకాలమునందే తటస్థించినవి. ఇదియును జిత్రమే.

మాల— తండ్రీ ! ఆయార్తప్రలాపంబులే లేకున్నచో నేను దివ్యానందభరితురాలనగుదును. నేనే యొక దేవతనైతినా యొక క్షణములో వారిదుఃఖములఁబోగొట్టఁ బ్రయత్నింతును.

చిత్ర— పుత్రీ ! విచారింపకుము.

మాలి— నాయనా ! ఎట్లు విచారింపకుందును ?

చిత్ర— పట్టీ ! ఇదియంతయు నీమేలునకై చేయఁబడినది సుమీ ! ఇది గాక,

గీ॥ ఎప్పుడీవనిఁ జేరితి మెందుకిచట
నుంటిమోయను తలఁపు నీకంటదయ్యె !
బాణహతిఁ జెంది కడుబాధపడుచునున్న
తల్లివెనువెంటఁ జను లేడిపిల్లకువలె॥

మాలి— తండ్రీ ! నాకెప్పుడట్టి బుద్ధి పుట్టలేదు.

చిత్ర— కుమారీ ! ఇదియే యర్ఘ్యసమయము.

(మంత్రోదకము పైనిజల్లుచున్నాఁడు)

మాల— నాయనా ! సెలవిండు.

చిత్ర— తల్లీ ! మనమీ యరణ్యభూములకు వచ్చునప్పటికి నీవు మూఁడేండ్లపిల్లవు.

మాల— నాయనా ! నాకుఁగొంచెము జ్ఞాపకమున్నది.

చిత్ర— ఎట్లు !

మాల— ఆర్యా ! నాకప్పుడు నలుగురైదుగురు దాదులు లేరా ?

చిత్ర— (హీనస్వరముతో) తల్లీ ! నలుగురైదుగురేమి ! అంతకంటె నెక్కుడు గలరు. పండ్రెండేండ్ల క్రిందట నీజనకుఁడవంధ్యపరాక్రముండైన కళింగదేశ మహారాజు సుమా!

మాల— (హీనస్వరముతో) తండ్రీ ! మీరు నాజనకులు గారా ! (తొడయెక్కుచున్నది)

చిత్ర— (మేను నిముగుచు) అవును. అసామాన్యరూపవిభవవగు నీవు నా తనూభవవే.

మాల— నాయనా ! అట్లయినచో నామహారాజ్యపదవి విడిచి మనమీ యరణ్యదేశములకు వచ్చినది మేలునకా ! కీడునకా !

చిత్ర— కుమారీ ! మొదటఁగీడునకే యైనను గడకు శుభోదర్కమేయయ్యె. ఏలనన ! నాతమ్ముఁడును నీపినతండ్రియునగు వృషకేతుఁడను వాఁడు మనకీయపకారమొనరించె.. అన్నిటికి నాతఁడేయని నమ్మి రాజ్యభారమాతని యందునిచి నేను మంత్రశాస్త్రాభ్యాసమొనరింపఁ దలంపుఁగొంటి- అప్పుడు నారాజ్యము తక్కినవానికంటెఁ గడుగొప్పదియై యనేకసామంతరాజులచేఁ గప్పము గొనుచుండె. తరువాత నీమాయాపి, వినుచుంటివా !

మాల— (బాష్పాకులనేత్రయై) తండ్రీ ! వినకేమి.

చిత్ర— కుమారీ ! రాజ్యసంబంధములైన మంచిచెడ్డలను గ్రహించి నాకిష్టులైన వారి నుద్యోగములనుండి తొలఁగించి తనతోడనుండు వారినందఱి నున్నతోద్యోగులఁ జేసె- కావున వారందఱిమద్దెలకుఁ దగిన తాళము వేయుచుండిరి- అందుచేఁ జెదపురుగువలె నాస్థానమంతయుఁ దొలిచి తద్రసమెంతయుఁ బీల్చిపిప్పి చేసినాఁడు

మాల— అన్నా ! పినతండ్రియేనా యింతపని చేసినది !

చిత్ర— ఇంకను వినుమా- నేను దీనిని లక్ష్యపెట్టక నామంత్రశాస్త్రములలో మునిఁగి తేలుచుఁ బరమార్థ చింతచే నిహలోకసుఖ నిర్లిప్తుఁడనై విరాగినైతిని. అంతట వాఁడును నేను వానియందుంచిన నమ్మకమునకు బదులుగా నపకార బుద్ధి వహించి రాజ్యమును హరింపఁదలంపుగొని తానే రాజునని పిలుచుకొనుచుఁ దత్సంబంధిక రాజచిహ్నముల నెఱవఁజొచ్చెను వింటివా !

మాల— నాయనా ! వినకేమి. నీవుచెప్పునది చెవిటివానికైన వినఁబడును.

చిత్ర— అంతట నాకుఁ గప్పము చెల్లించుచుండిన చంద్రసేనుఁడను వంగ దేశాధిపుతోఁ గుట్రచేసి తాను వానికిఁ గప్పముగట్టునట్లొప్పుకొని

క॥ పాపమలినరూపుండగు
నీపినజనకుండు మదినిరాజ్యరమన్
జేపట్టి నిన్ను నన్నును
నోపట్టీ ! పారఁదోలనుద్యుక్తుండై॥

మాల— తండ్రీ ! నాపినతండ్రి తప్పుపట్టెను సుమీ ! తరువాత-

చిత్ర— (కన్నీళ్ళతో) తరువాత,

గీ॥ కన్నుగానని యాపాపి కన్నుగన్ను
గానరానట్టి కటికిచీకటిని ఘోరు
మనుచు వడగండ్ల వానలేవునను గురియఁ
బారఁదోలెను సుమ్ము కుమారి ! మనల॥

మాల— (జొటజొట జార్చుకన్నీళ్ళతో) అప్పుడెట్టులేడ్చితినో జ్ఞాపకములేదు గాని నాకిప్పుడు పెద్దయేడుపు వచ్చుచున్నది-

చిత్ర— (కన్నీళ్ళు తుడుచుచు) కుమారీ ! ఏడువకుము-

మాల— నాయనా ! మనల నిద్దఱ నేలచంపఁ జంపినారుకారు ?

చిత్ర— మాలతీ ! నీప్రశ్న కడుసందర్భముగానున్నది- మనలఁజంపినచో నాయందమిత భక్తివిశ్వాసములుగల యీరాజ్యప్రజలెదురుకొని యరాజకము చేయుదురను భయముచే వారు సాహసింపరైరి. పిదప వారిలో దయామూర్తి యగు

సుమంత్రి యనునాతఁడు మంత్రగ్రంథములయందు నాకభిమాన మెక్కుడనుమాట నెరిఁగినవాఁడు గనుక రహస్యముగా నాకీపాత్రములఁబంపినాఁడు.

మాల— పరమోపకారియగు నాసుమంత్రిని నాకమారు చూడవలయును- నాయనా! అప్పుడు నేను మీకెంత కష్టముగా నుంటినో!

చిత్ర— తల్లీ!

చ॥ ఉడువళు నాకు దుఃఖ విపులోదధినీదదు వేళ; జ్యోత్స్నయై
యడరెను మందహాసము మహాతిజాతమంబు హారింప; నీదుత్రొ
క్కుడుపలుకుల్ చెలంగెను నకుంఠితసత్వ సహాయమిచ్చియో
యుమపతివక్త్రి! యేలబహుళోక్తి; పితృూణముఁ దీర్చితెంతయున్॥

మాలి— తండ్రీ! అపారవత్సలతగల జనకుల నోటనుండి మరియేమి వెడలును? తరువాత-

చిత్ర— తరువాత నిటనీయాశ్రమమును గల్పించికొని బోయలగు నాకన్యలకు మనోరమా కళావతులను పేరుపెట్టి నీకును వారికిని జమళు నేర్పుచుఁ గాలము గడుపుచుంటిని- కాని నేడు నాపున్నెము పండెను-

మాల— నాయనా! అదియేమి.

చిత్ర— కుమారీ! నీపినతండ్రియు నాశత్రురాజు నేటకో యుద్ధమునకేగి యిటుతేగుదెంచుచుండ మనసుముఖునిఁబంపి తప్పుదారిపెట్టించి మాయామృగముల ననేకముల సృష్టించి చెల్లాచెదరుగఁ గొట్టించితి అందుచేత వారలాక్రందనము చేయుచున్నారు- కాని వారిలో నాకరికైన నావంతయైన బాధ కలుగదు- ఇఁక నీప్రశ్నలుమానుము- నీకు నిద్దుర వచ్చుచున్నట్టులున్నది పండుకొమ్ము.

(అంతమాలతి నిద్రించుచున్నది)

సుముఖా! ఇటురమ్ము- క్షాత్రియశిష్యా! వేగరమ్ము-

(సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుము— ఉ॥ ధారుణిఁజుట్టుమన్న హిమధామరవీంద్రులఁగట్టుమన్న నో
నీరధిఁబీల్చుమన్నను గణింపక లోకముఁగాల్చుమన్న నా

ధారములేక మారుతపథంబున వ్రేలుచున్న సిద్ధమై
చేరువ నున్నవాఁడు ప్రియశిష్యుఁడు చెప్పఁగదే గురూత్తమా॥

చిత్ర— సుముఖా! నేను నియమించినట్లు సర్వమును జేసివచ్చితివా!

సుము— గురువరా! ఏల సందియము-

ఉ॥ ముంచితి దుఃఖఘూర్ణిత సముద్రమునన్ బరిపంథిరాజిఁ గ
ల్పించితి రామసేనయనఁ జిక్కు మెకంబుల; వారినెల్లఁ దో
లించితి నల్లగంబుఁ జలింపక నట్టడవిన్; వసంతు ర
ప్పించితి నీవనీస్థలికి; వేరెయిఁకేమి యొనర్చు కార్యముల్॥

చిత్ర— సుముఖా! నీవొనర్చిన యీభయమునకు వారు చలచిత్తులుగాలేదా?

సుము— గురుచంద్రా! నిజముగా వారిలోఁ బిచ్చిపొందనివారు లేరు-

చిత్ర— విధేయా! వీరినందఱి నెక్కడెక్కడ నిల్పితివి-

సుము— మునితిలకా! వినుము-

ద్విపద॥ వంగదేశాధిపు వానియమాత్యు
వెంగలి వృషకేతు వీరసేనునిని
భూతభేతాళ సమూహంబు గలిగి
ఘాతుక మృగతతి కలయఁగఁ దిరుగఁ
బగలెచీకటి గ్రమ్ము పక్షిరావముల
వగలఁబాల్సేయంగఁ బ్రాగ్దిశాస్థలిని
వెలుగొందు నామఱ్ఱివృక్షంబు కడను
నిలిపితి నయ్యయో నిర్మలాచార!
తక్కువారలనెల్లఁ దమపాంతసీమఁ
జిక్కు తావులఁ జేర్చి చిత్రజాకారు
సరసవాక్యకలాప సంగీతరతునిఁ
గరుణాబ్ధి స్త్రీలతా కమ్రవసంతుఁ
డైన వసంతుని నర్థి యెత్తుకొని
మానుగ మనయాశ్రమంబుఁ జేరితిని॥

చిత్ర—శభాస్! సుముఖా! అక్షరమైనఁ దప్పకుండఁ జేసితివి- వారందఱికిఁ గుశలమా!

సుము— గురువరా! వారికి ఏవిధముల్లం తైనను బాధలేదు.

చిత్ర— ఇప్పుడు రెండు యామములైనట్టులున్నది. సాయంకాలము పడు వరకు మనము చాల పనిచేయవలసియున్నది చూచితివా!

ఉ॥ మేతలకేగి యెండవడి మేనులు గ్రందఁగ నంగలార్చుచున్
శీతలభూరుహాళి వడిఁజేరెడుఁ జూడుఁ విహంగసంఘముల్
ఖాతులు పద్మనాళచయ పార్శ్వములందునఁజెరిము న్గెషిక
ఘాతుకజంతువుల్ బడలి నాల్కలఁజాపుచు నేలఁబండెడిన్॥

సుము— మునివరా! అవును. ఇఁకను నేను చేయవలసినపని యున్నదా! మొన్న నాతోడ దయామయులగు తామ రెండు మూఁడు దినములలో నన్ను విడుదల చేయుదునంటిరి-

చిత్ర— శిష్యా! నేనడిన యేడాది గడువు గడచినదా!

సుము— గురుచంద్రా! గడువకపోయినను విశ్వాసముతోఁ బనిచేసెకృతజ్ఞుఁడ నగుటచేత.

చిత్ర— మంచిది. నేను నీకొనరించిన యుపకారము మఱచితివా!

సుము— దేవా! వెయ్యేండ్లకును మఱువను

చిత్ర— ఏదీ! చూతము నీజ్ఞాపకము.

సుము— సీ॥ విడిపించితివి వటవృక్షకోటర వాసిమైయుండి దుఃఖంబులందున న్నను
పోఁగొట్టితివి రోదసీగహ్వర ప్రమాణంబగు తృష్ణాబాధ నాకు మొదట
రాల్పించితివి బ్రహ్మరాక్షస భీకరాంగంబు తేలికయైన కాయ మొసఁగి
యడఁగించితివి చెప్పనలవిగాకుండు నాయుదరంబులోని పెంపొదవుమంట
చేర్చుకొంటివి నన్ను నీసేవకునిగఁ
బెంచుచుంటివి యాత్మజప్రేమతోడ
నింతయుపకార బుద్ధి వహించు మిమ్ము
మఱతునే తండ్రి! వేయి జన్మములకైన॥

చిత్ర— సుముఖా! నీవు కృతజ్ఞుఁడవే యగుదువు. స్వల్పకాలములో నీకు స్వేచ్ఛాప్రాప్తి లభించును.

సుము— చిత్తము.

చిత్ర— చూచితివా! పలుమారు నన్నుఁ బీడించెడి నాదుర్ముఖుని యవస్థ.

సుము— అవును. వాఁడు రేయింబగళ్ళు దుఃఖించుచునే యుండును. వాఁడెవఁడు!

చిత్ర— వానిసంగతి నీకేల! వాఁడొక బ్రహ్మరాక్షసిపుత్రుఁడు. అతికౌటిల్యుఁడు.

సుము— సరే! ఇఁక నేను చేయవలయునది యేమి;

చిత్ర— శిష్యా!

చ॥ ప్రళయమహానలార్చులఁ గరంబువనంబునఁ జేర్చిపేర్చి యం
దులగల శత్రువర్గమును ధూమము గ్రమ్మఁగఁ జేసిచేసి చె
ట్టులమొదలంటఁ గాల్చుచుఁ గడున్ ఘనమంటలలోనఁ జేర్చి వా
రలఁగలగుండువెట్టి వడిరమ్మి యదృశ్యతనూవిలాసతన్॥

సుము— వహ్వా! పరమ సంతోషము. ఇదె పోయివచ్చెద-

(నిష్క్రమించుచున్నాఁడు)

చిత్ర— కుమారీ! మేల్కొనుము గాఢనిద్రపోయితివి-

మాల— (ఒడలు విరిచికొని కండ్లు తుడిచికొనుచు) నాయనా! మీరుచెప్పిన యత్యంతాశ్చర్యమగు వృత్తాంతమును వినుచు నట్టె నిద్దురపోతిని-

చిత్ర— కుమారీ! అవును. మనకవిధేయుఁడగు దుర్ముఖునికిఁ బనిచెప్పవలెను-

మాల— నాయనా! క్షమించి వానికి నన్నుఁగనఁబర్చకుము- వానినిఁజూచినయెడల నాయొడలు పులకించును-

చిత్ర— వాఁడు దుర్మార్గుఁడైనను మనము విడరాదు- అగ్నిహోత్రమునకుఁ గావలసిన సామగ్రులను దెచ్చుటయు నీవు పువ్వులమొక్కలకు నీళ్ళుపోయుటయు వాఁడే గదా చేయుచుండును-

ఓరి దుర్ముఖా! ఇటురమ్ము-

(దుర్ముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చిత్ర— ఓరి దుర్ముఖా! ఏమిరా పలుకవు-

(అదృశ్యుఁడైవచ్చిన సుముఖుని చెవిలో నేదియో చెప్పుచున్నాఁడు)

సుము— సురచంద్రా! ఆజ్ఞచేసెదనుగాక-

(సుముఖుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

చిత్ర— ఓరి పాపీ! దుర్ముఖా!

దుర్ము— నీకంటె పాపులును, దుర్మార్గులును బ్రపంచమందు లేరు-

చిత్ర— ఓరి యభాగ్యా! కుశసమిత్ఫలావళులఁ దెచ్చితివా! లేదా!

దుర్ము— తొందర యేల! తెచ్చెదను లే-

చిత్ర— ఓరి దుష్టా! సాయంకాలాగ్నిహోత్రములకింక నెప్పుడు తెచ్చెదవురా! నీకుఁదగిన శిక్ష గావలెను- మన్నుదిన్న పామువలెఁ గదలవు-

దుర్ము— అవును- నాజననిడగు నీవనభూమిని నామె పోయిన తరువాత నీమంత్ర పాటవమునఁ గైవశము జేసికొని భూస్వామినగు నన్నుఁ గొంచెమైన దయతో నైనఁ జూడక నన్నుబాధించుచున్నావు కానిమ్ము-

చిత్ర— ఓరి దుర్మార్గా! నీకెంత యుపకృతి యొనరించిన నట్టులే ప్రేలుచుందువు చూడుము నీసహచరుఁడగు సుముఖుఁడు,

గీ॥ పాలుద్రాగించినను బన్నగాళివిసమె
యొసఁగి విశసించుఁ; బసువులు గసవుమేసఁగి
కుంభవృష్టిగ క్షీరముల్ గురిసి తనుపు
కుజన సుజనులకలవడు గుణములివియే॥

దుర్ము— అవును మాటలకేమి! వేయి చెప్పవచ్చును-

గీ॥ రాత్రిబవలును లేక నీరములమోసి
తడపుదును బూలచెట్లు నీతనయకొరకు
దర్భలను దెచ్చి మఱియు వస్త్రములనుదికి
నీదయనుగోరుచుంటి నీవాటమేల!

చిత్ర— ఓరీ పాపీ! శుద్ధ ద్విపాదపశువగు నీకెన్నియో నేర్పి యింతవరకైనఁ దెచ్చితిని-

చ॥ కఱపితి నీకుఁ జక్కఁబలుకందగు రీతులఁజూపువిద్దెలన్
నెఱపితినీకు సద్వినయ నిర్మలచారు వివేకవర్తనల్

మఱుచితిపన్నియుఁ సహజమున్ దమనీషిచి యోటు; గాలి, పై
నోఱయుచు నైశ్రేణిఁ దానిని నోప్పెదు చిహ్నాల మాంపురీతిగన్॥

సుము— నాకుఁ జెప్పిన విద్యలెల్లను నిన్ను బోషించుటకే వినియోగపడినవి-

చిత్ర— మహాత్మా! ఇఁక ప్రేలక కుశామలను వేగఁ జెమ్ము లేనన్న యిక్కడనే నిన్ను నిప్పుడు శిక్షించెదను.

సుము— (తనలో) ఈతఁడట్లు చేయక తప్పదు- ఇఁక మనము పోవలెను- (ప్రకాశముగా) క్షమింపుడు- ఇదె పోవుచున్నాను-

చిత్ర— పొమ్ము- (సుముఖుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(కృపాణధారియైన వసంతునిలో సుముఖుఁడదృశ్యుఁడై ప్రవేశించుచున్నాఁడు)

(సుముఖుఁడు పాడుచున్నాఁడు)

ద్విపద— 1- చిలుకలు చెలరేగి కలకూజితములఁ । బలికెడు కర్ణపర్వంబుగా వినుమ

వసం— ఏమిది- ఈ సంగీతమెటనుండి వచ్చెడినో! చిలుకల పలుకులకేమి గాని యీగానమే కర్ణపర్వముగానున్నది-

సుము— 2- పికములు చెట్లపై సకియలఁగూడి । చకచకవిహరించు చాయలు గనుమ

వసం— ఈగానరవముచే నాదుఃఖము బోయి సంతోషమువచ్చుచున్నది-

సుము— 3- తుమ్మెదల్ పూల జుంఝుమ్మని మోగిసీ । కమ్మని తేనియల్ గావించుచుండు

వసం— (నిశ్చేష్టుఁడై) ఇది యద్భుతముగానున్నది-

సుము— 4- చల్లనిగాలి వాసనలను దెచ్చి । మెల్లమెల్లగ సోకి మేనిపైప్రాలు

వసం— దీనితో నాపంచేంద్రియములును దనుపఁబడినవి-

సుము— గీ॥ పావకునికిప్పుడర్పింపఁబడియెఁ దండ్రి
మంత్రులాదిగ జనమెల్ల మంటఁగలిసె
మన్మథాకార! యోరాకుమార నీకు
సతము క్షేమంబుగల్గునీశ్వరునికృపను॥

వసం— (నిశ్చేష్టుఁడై) ఏమిది- యీగానధ్వని నాజనకవృత్తాంతముగూడఁ జాటుచున్నది- ఇది యేమి మాయాగానమో గదా!

చిత్ర— కుమారీ! పద్మపత్రములంబోలు నీకనుఱెప్పలవిప్పి నీముందుగల సంతోషవస్తువును సందర్శించి యానందింపుము.

మాల— (కనుఱెప్పలెత్తి) ఆర్యా! ఆమహానుభావు లెవ్వరు! కృశీభూత దేహులై ఘోరారణ్యములఁ దపముచేయుచుండు మహామునీశ్వరులకప్పుడప్పుడు శ్రీమన్మహావిష్ణువు ప్రత్యక్షమగునని యందురు గదా! అట్టిభాగ్యము మీకు నేడు లభించియుండును.

చిత్ర— (హర్షముతో) కుమారీ! నీవనునట్లా కనఁబడుచుండు పురుషుఁడు విష్ణునంశా సంభూతుఁడే సుమీ!

వసం— ఓహోహో! ఏమి నాభాగ్యము! విధాతృని బుద్ధివికాసము లిట్టివని వర్ణింపనశక్యము. అతిశ్రద్ధతోఁ దగినపరిజనము పెంచుచున్నను బొందరాని యున్నతస్థితిలోనున్న యీయారామవృక్షములును బుష్పజాతులును నిర్మలోదకములచే విరాజిల్లెడు నీసరస్సును జూడ నిదియేమిమాయయో యని తోచుచున్నది. (నడుచుచు) ఇప్పుడుగదా నాకు జన్మసాఫల్యమును నేత్రానందమును గలుగుచున్నవి. పదియాఱువన్నెబంగారము కరువుగట్టిచేసిన బొమ్మవలెఁ బ్రకాశించెడు నీనారీమణి యెవ్వతెయో! దీని ముఖవికాసములును దీని కటాక్ష విభ్రమములును దీని లావణ్య తారుణ్య నైపుణ్యములును జూడ నిది సాధారణ మనుజ భామిని వలెఁదోచదు.

మ॥ ననుపా వీణియఁబూని పాడు వరగంధర్వాంగనో కాక, చ
క్కని లేగాలులసోకవచ్చిన భుజంగస్త్రీయొ, కాకున్న స
న్మనులన్ మారునిబారిఁ ద్రోయగల సమ్మోహాస్త్రమా రంభయో
మనుజాబ్జాననగాదు సుమ్మి యిది వేమాఱుల్ పరీక్షించినన్॥

(నడుచుచు) అదిగో! ఆప్రక్క నెవ్వరో యొక మహానుభావుఁడు గడ్డములు జడలాదిగాఁ బెంచుకొని యేకుల బుంగవలె నున్నాఁడు. మనమనుకొన్నది నిశ్చయము కావచ్చును. ముందు వీరి సంబంధ బాంధవములఁ బరికించి తరువాత నాయదృష్టము చూచికొనెదనుగాక. ఓహో! ఈవనరామణీయకతఁ జూచి నాకు వదలవలయుననియే లేదు

శా॥ ఈపూఁదోటల నీడ నీకొలఁకులందీ కేతకీపుష్పవా
టీపార్శ్వంబుల నీతపోవనమునన్ శీవిన్ మరుద్దాన స

ద్వ్యాపారంబుల నెనరించిన యజ్ఞాసంతపాథోధిలో
నేపారంగ మునుంగు కన్నకలవే యెన్నంగ సౌఖ్యార్థమున్॥

మాల— అట్లయినచోఁ దనసుఖవికాసము డిందుచుండఁ జింతించుచుండెనేమి ?

వసం— హృదయభూమినిఁ జెకలింపఁగల యాజగన్మోహినిదగు కటాక్షలాంగలిము ఖమెంత తీక్ష్ణముగానున్నది.

గీ॥ మనుజపూరుషు నెప్పుడు గనమిచేతఁ
గాదె లజ్జాభయాశ్చర్య కలిత యగుచు
తెప్పవేయక చూచు నీరేజనేత్ర
సౌరభామిని దానను జాడఁదెలుప

చిత్ర— కుమారీ! జనకాదులఁ బోఁగొట్టుకొనుటచే నట్లున్నాఁడు-

మాల— నాయనా! అట్టియుపద్రవమీయనకేల సంభవించెను ?

చిత్ర— కుమారీ! కొంచెము సేపు తాళుము. అంతయు నీకెఁదెలియఁగలదు.

వసం— (ఆనందముతో) వీరిసంబంధము హృదయరంజకమగు వీరిసంభాషణ చేత నే తెలియవచ్చినది- గావున నీమె మనుజభామినియు నాతని గారాబు పట్టియున ని నిశ్చయింపవలసియున్నది- వీరిస్నేహము మహారాజులమైన మనకు నరచేతి ష్మపంచువంటిది- అయినను వీరితోఁ బ్రసంగించు కథా సందర్భమునకై యాలో చించుచున్నాను- (ఆలోచించి) ఆఁ. తెలిసినది. బుద్ధిమంతుల కూహల కేమి కొదువ.

చ॥ మునివరులన్ బ్రశాంతగుణముఖ్యులదాంతులఁ గాంచుతోడవం
దనములొనర్చ ధర్మముగదా మముబోంట్లకు; వారికన్న, దీ
వనల నొసంగ నైజము ప్రభావయుతోజ్వలమూర్తులౌటఁగా
వున నిదె వంకఁజేసికొని పోయెద నామహనీయునొద్దకున్॥

(దగ్గఱకుఁజేరి) మునిచంద్రా! భవదీయవిధేయుఁడగు నాక మహారాజ పుత్రుఁడిదె మీయాశీర్వాదములఁగోరి నమస్కరించుచున్నాఁడు.

చిత్ర— నమస్కరించినవారి నాశీర్వదింపమి దోషమగుటచే నిన్నిదె దీవించుచున్నా ను. తరువాత మాయాజ్ఞోల్లంఘనము జేసి యీయాశ్రమవాటికఁ జొచ్చినందు లకై శిక్షించుచున్నాను.

వసం— మునివరా! మీరేమిచేసినను సరే! మీవంటివారు పెట్టుకష్టములు భావిఫలములకొరకే. అంతకన్న నాకెక్కుడు సుఖములేదు.

సీ॥ మిగులకష్టంబునొందిన మీఁదఁగలుఁగు
సుఖమదెంతని నుడువంగ సులభమౌనె?
పాదపంబెక్కు కష్టంబు పడెడువాని
కేలభించును స్వాదు ఫలాళులిలను॥

మాల— ఓ యనుంగు తండ్రీ! ప్రథమదర్శనమునందే యీతని నంత జులకన చేయకుఁడు.

చిత్ర— కుమారీ! ఇందు నీవు మాటాడఁగూడదు. ఇటనుండక నీవుపోయి నీసఖులతో నాడుకొమ్ము.

వసం— (తనలో) ఇక్కడ నామెను నిలిపినచో నన్నుఁ గారాగారవాసునిఁగఁ జేసినను సంతోషముగానుండును. ఆతఁడు పాపమునకొడిగట్టుకొన్నాఁడు.

చిత్ర— ఓరి మూర్ఖా! మహారాజపుత్రుఁడనని విఱ్ఱవీగితివి. నీకులగోత్రములెవ్వియో పేర్కొనుము.

వసం— (తనలో) ఇది మనకుపకారమే! ఆమెయు వినును గదా. (ప్రకాశముగా) ఋషిచంద్రా! దీనుఁడనైన నాపై శాంతము వహించి వినుఁడు.

చ॥ వినుఁడు. మదీయవంశమతివిశ్రుతమై యరిమండలంబులన్
గినుకమెయిన్ జయించుచు నకిల్బిషవృత్తిఁ జతుస్సముద్ర పా
వనమగు వంగదేశమును బాలనఁ జేయు మహావనీశ్వరుం
డనఁబడు రాజచంద్రుఁడ మహావిభవోజ్జ్వలకీర్తి సాంద్రుఁడన్॥

మాల— (తనలో) మాజనకుని శత్రువగు వంగదేశ మహారాజ కుమారుఁడీతఁడు అందుచేనిట్లు కఠినతవహించెను- యీతని సౌందర్య మవర్ణ్యనీయమై యున్నది; నాప్రయత్నము కొనసాగ విధి యనుగ్రహించుగాక.

చిత్ర— ఓరి! నీవెంతరాజకుమారుఁడవైనను బరభూముల నాక్రమింప నూరుకొనరు గదా!

మాల— (తనలో) అయ్యో! నాతండ్రి యీతని యెడల నెంత నిర్దయుఁడయ్యెనో! ఈతఁడు నామనోనుకూలుఁడగునట్లు దైవంబనుగ్రహించుగాక (ప్రకా

శముగా) నాయనా ! అతని శిక్షింపఁబోకుము అతని సన్మార్గ ప్రవర్తనకు నేను బాధ్యురాలనగుదును.

చిత్ర— ఓసీ వేలా ! నేనేమని చెప్పితిని. ఇంక నిక్కడనే యుంటివా ! నిన్నగాక మొన్నబుట్టి నీవా నాకు హితము చెప్పుచున్నావు ఛీ ! పొమ్ము.

మాల— (తనలో) ఇఁక పోఁగక తప్పదు. కామభగవానుఁడా ! అంత భారము నీమీదనే వైచి పోవుచున్నాను. (పోవుచు) (వెనుకకుఁదిరిగి) నాయనా ! నా వీణ యెచటఁబెట్టితిరి- (అనివసంతునిఁ జూచుచున్నది)

చిత్ర— (తనలో) వీరిలో నన్యోన్యము మోహబీజాంకురములు గాఢముగా నాటుకొనినవి (ప్రకాశముగా) ఓసీ చేడుగా ! దాని యెప్పటి తావుననే యది యున్నది పోయి వెదకుకొమ్ము.

మాల— చిత్తము. (అని నిష్క్రమించుచున్నది.)

చిత్ర— ఓయి రాజకుమారా ! నీవెంత గొప్పవాఁడవైనను నీనేరమునకై శిక్షింపనవసరము గాన నట్లు చేయఁబోవుచున్నాను.

వసం— కటాక్షించి ప్రథమదోషమునకై క్షమింపుఁడు.

(తనలో) గీ॥ జనకమృతియును మంత్రులచావు నీయ
ఘోరదుఃఖంబులీతని దారుణమును
నేనుగణియింప సుంతైన ; నింతి నింతఁ
గాంచనిచ్చిన కన్నుల కఱవుదీర॥

చిత్ర— నిన్ను క్షమించునది లేదు. నీవు బోయి యదిగో ! యాకనఁబడుచుండు పూఁదోటను మట్టుగట్టి నీరు తోడుచుండుము- ఇంక మారు మాటాడకుము నేను బోవుచున్నాను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

వసం— ఈమహానుభావుఁడు నాకిట్టి యకార్యకరణమునకేల నియమించెనో ! ప్రథమ సందర్శనముననే యింత రోషాగ్నికీలలకేల బాల్పడెనో ! కొందఱకు ముందు కోపమును దరువాత నంతకినుమడిగ దయయు గలుగుననుట వింటిముగదా ! ఈతఁడు నన్ను నీచకృత్యంబునఁ బ్రవేశింపఁజేసినను దీనిలోఁగూడ నిండు దయగలదని నాకుఁదోఁచుచున్నది. ఏలనన.

గీ॥ పూవుదోటకు నీరెత్తఁబోవువేళఁ
బూవుబోఁడియు వచ్చుచుఁబోవుచుండు

కతన నన్యోన్యముఖవిలోకనముగల్గు
నంచుఁ గల్పించె ఓసిరో ంచనేల ? ॥

ఇదిగాక నామనస్సు పూర్ణముగా నామెయందుఁ జిక్కుపడియున్నది.

గీ॥ అరిగె నతితోడ మనసు నాయాజ్ఞఁగొనక
కదలెడి మునీశు నాజ్ఞ నాకాయమిట్లు
తనకు దేహాత్మలందు స్వాతంత్ర్యవృత్తి
యుంచుకయు సున్న దెంత పోషించుచున్న॥

ఆమెపై నాకెంత మనసు దగిలియున్నను నామె యభిప్రాయము గ్రహింప నశక్యముగానున్నది- ఏలనన-

ఉ॥ భూతదయాలవాలయుఁ బ్రఖ్యాతగుణాకరయుక్ మహాకళా
స్వీతయు నొటచేతను వినీతమతిక్ రమణీలలామ, న
న్నాతఁడు పీడచేయ, వలదంచు వచించెనుగాని మోహసం
జాతగుణప్రభావకృతచాతురియే యని యెట్లులెంచెదక్॥

అయిన నాపూఁదోటకేగి యామెరాకకై వేచియుండెద (నిష్క్రమించుచున్నాఁడు)

---

ప్రదేశము iii. ఉద్యానవనము-

---

(మనోరమ అంతట ప్రవేశించుచున్నది)

మనో— భర్తృదారికయగు మాలతి నాతో “ఓసీ ! మనోరమా ! నేను ముందు పోయి మాలతీలతా మంటపమునఁ గూర్చుండి యుద్యానవన వైచిత్ర్యముల వినోదించుచుఁ బ్రొద్దుబుచ్చుచుందును. నీవును గొంచెము సేపాగిరమ్ము” అని చెప్పియున్నది- (నడచుచు) ఏమియోగాని యీయాశ్రమంబుకడకుఁ దప్పుదారిని వచ్చిన యావసంత కుమారుని గాంచినప్పటినుండియు మన్మథుఁడు చిల్కరథ మెక్కి తన సన్నాహము తాను చేయుచున్నట్లులున్నాఁడు- (తెరకెదురుగాఁ జూచి) ఎవరో యిటు వడిగా వచ్చుచున్నారు. మన కళావతి కాదుగద. అవును సందియమేమి- దీనికేమైన తెలియునేమో ? (కళావతి ప్రవేశించుచున్నది)

మనో—కళావతీ ! ఏలనే నాతోఁ జెప్పకనే యెక్కడకో వడివడిగా వెళ్లుచుంటివి.

కళా—సఖి ! మాలతీ దర్శనార్థమై : ఎక్కడనున్నదో నీకుఁ దెలియునా ?

మనో—సఖి ! మాలతి యుద్యానవనమాలతీలతామంటపంబున నుంచు ననియు

నక్కడకు మనల రమ్మనియు నాతోఁ జెప్పిపోయినది.

కళా—ఇఁక నేమైనఁ జెప్పినదా ?

మనో—నాతో మరేమియుఁ జెప్పలేదుగాని యామెముఖపద్మము కొంచెము వాడి యున్నది.

కళా—ఏలనో ?

మనో—వసంతకుమారునిమీద మనసు దగులుటచేత

కళా—నీకెవరు చెప్పిరి ?

మనో—దుర్ముఖుఁడు చెప్పినాఁడు

కళా—ఇఁక నేమిచెప్పినాఁడు.

మనో—వసంతునిఁ బూలదోటకు నీళ్లుబోయ గురువులాజ్ఞాపించుటచేఁ దనపనిలోఁ గొంత తగ్గినదనియు సంతోషముతో చెప్పినాఁడు.

కళా—అట్లయినచో వారలిద్దరిక్కడనే యుందురందువా ?

మనో—అవును. మనము కూడనటు బోదము !

కళా—మంచిది. (నిష్క్రమించుచున్నారు)

మాల—(సోత్కంఠయై) నేనామహానుభావుని జూచినప్పటినుండియు వేదాంతులకుఁ బరమశివునివలె నీలోకమంతయు మిథ్యగాఁదోచుచున్నది. నాపిరికి హృదయము నన్ను వీడియాయనలోఁగలిసి శత్రుబాణమయినన్నుఁబీడించుచున్నది. ఈసంగతి మనోరమాకళావతులతోఁ జెప్పినచో నన్నుఁ బరిహసింతురో లేక ప్రాణావనమైత్రీ తార్థురాలునిగఁ గావింతురో ! వారిని గొంచెము సేపుతాళిరమ్మంటినిగదా ? ఇంక నురాలేదు,

(మనోరమా కళావతులు ప్రవేశించుచున్నారు)

కళా— సఖీ ! మాలతీ ! ఎక్కడ.

మాల— ఇక్కడ.

వసం— (పరికించి) ఎవరో దూరముగా నామూలనుమాటలాడుచున్నట్లున్నది. అటుపోయెదనుగాక.

మనో—సఖీ ! కళావతీ ! నేనుమాట్లాడుదానికి యుక్తియుక్తముగా నుత్తరమిచ్చుచుండుమా !

కళా—నా పేరు సార్థకముచేయఁ బ్రయత్నించెదనుగాక.

మాల—అదుగో! నాచెలికత్తెలు వచ్చిరి. వేరుతీరున వీరికిఁ గనఁబడరాదు.

మనో—సఖీ! మాలతీలతలు బాగుగా పుష్పించినవా!

వసం—(చాటున నుండి) ఆహా! వీరితనూవిలాసము లెంత హృదయంగమముగా నున్నవి.

. గీ॥ స్వర్ణవర్ణ విలాసమై స్వాదురసవి
రాజితంబగు చూతమహీజరాజ
ఫలముబోలె నతీమణుల్ జెలఁగుచుండ్రు
దేహరుచిచేత మాటల తీపిచేత॥

అందులో మనకుఁబరిచయయగు నీకన్య మరియు శోభాకరయై యున్నది. పాప మీమెకు నారచీరయే గతియయ్యె. అయినను,

ఉ॥ ధూళిపరీతమయ్యుఁబరితుష్టిని జేయవె చిత్రచిత్రముల్
తాళదళంబులెంత శిథిలంబయినన్ గవిచంద్రుపద్యముల్
గ్రాలవె హృద్యమై; యటులె రంజిలు వల్కలమున్ ధరించియున్
మాలతి; నైజవస్తుగత మానితసంపద వోవదెప్పుడున్॥

కళా—మనోరమా! నీకాసందేహమేల! మనమింత సాదరముతోఁ గాపాడి తగినసమపాయము జేయుచుండఁగా నాపైని వసంత ప్రసన్నమగుటచే నేలవికసింప కుండును?

వసం—ఓహో! కళావతీ నామసార్థకయగు నీమె మధురాలాపము లెంతయాకర్షించుచున్నవి.

గీ॥ నర్మగర్భితవాక్య సన్మానగరిమ
భావగతవృత్తియెంతయుఁబయలువెట్టు
నతులమతిగల్గు నీకళావతినిఁజూడ
నపరభారతియని చెప్పనగునుగాదె?

మాల—(ముసిముసి నగవు నగుచున్నది)

మనో—కళావతీ! నీకళానైపుణ్యముదీనిలో వినియోగించవలెనా? వసంతప్రసన్నమేమిటి? మాలతీవికసనమేమిటి?

కళా—సఖీ! నీపరిహాసములుగాని దీనిలో నైపుణ్యములేమిగలవు? వసంతప్రసన్నమనగా వసంతుని రాక: వసంతఋతువువచ్చినదనుట. మాలతీవికసనమనగా

మాలతిమనోహరమగుట. మాలతీలత, సుమములతో వికసించి మనోహరమగుట
యని నాయభిప్రాయము.

వసం—ఓహో! ఈమె కళావైదుష్యము లెంతకైనఁదగును.

మాల—(చిఱునగవుతో) ఏమీ! కళావతియెంత రసవంతముగా మాటలా
డుచున్నది?

కళా—సఖీ! ఏసమయమునకుఁదగినట్లు లాసమయమునకు రసోదయము కానిచో
నేమి శోభిల్లును?

మాల—ఇప్పుడే రసమునుగూర్చి మాట్లాడుచున్నావు?

కళా—వసంతాగమము గనుక శృంగారరసమునుగూర్చి.

వసం—యుద్ధకాలమునకుఁదగిన వసంతఋతుదినంబులును నాకాకయుఁగూడ నిపుడే
లభించినవి గనుక నీమె శ్లేషార్థములు మిగుల సొంపుగానున్నవి. ఇఁక నిట నిలిచి
వినెదను గాక.

మనో—సఖీ! కళావతీ! ఆమెమనసునకను దినమువలెఁ గుదురుబాటు లేదు. నీవా
క్రూరధోరణిగామాట్లాడకుము

మాల—(బెదరుచు) మీకున్నకుదురుపాటు నాకేల లేదే?

వసం—(సంతోషముతో) హృదయమా! శాంతింపుము. నాపక్షము వాదించుచు
నామె చెలికత్తెలు గట్టిగాఁ గుట్టుగదలుచున్నారు.

గీ॥ డెందమా! నీవు సందియ మొందనేల?
యీప్సితార్థంబు లింకనీడేరు గాన
సర్వమనుబుద్ధి దేనికిజడిసెదీవు
అట్టిదియె పూలదండ దైయమరునీకు॥

మనో—మాలతీ! నీవు దెలుపక పోయినను నీక్షేమాతిశయములఁ దెలియ గోరెదు
మాకెట్టులైనఁ దెలియును గాని బాగదు.

మాల—(సిగ్గుచేఁ దలవంచుకొనుచున్నది)

కళా—సఖీ! ఏల నీదాపరికములు- ప్రాణసమానలమగు మాయెడల నీవట్లులుం
డఁగూడదు- నీకోరిక వెల్లడింపుము- మేముదానినిఁ దీర్పఁ బ్రయత్నింతుముగాక.

వసం—ఇఁక నాప్రయత్నములు ఫలోన్ముఖములు గానున్నవి. పిరికిహృదయమా
భయపడకుము.

గీ|| తీర్చెదమటంచుఁ జెప్పెడు తెలివలకును
చేటుపరచదె ? లోనియారాటములను
వైద్యుఁడే తేరఁ దనదు రుగ్బాధఁ దెలుప
కున్న రోగికి నది యెట్లు తిన్నపడును ?

మాల—(తనలో) ఇఁక వెలువడక తీరదు. కాకనాకింకెవరు (ప్రకాశముగా) సఖులారా! మీరనినట్లు నాకు దాపరికము లేల (గద్గదస్వరముతో) నాకప్పటి నుండియుఁ గొంచెము తాపోత్పన్నమై యిప్పుడు కడుబాధించుచున్నది.

మనో—(నవ్వి) ఎప్పటినుండి ?

కళా—సరి! ఊరుకొమ్ము. వసంతకుమారాగమమునుండి.

మాల—(మూర్ఛిల్లుచున్నది)

(మనోరమా కళావతులచేఁ శైత్యోపచారములు జేయుచున్నారు).

వసం—ఓహో! నానామోచ్చరణముచేతనే యీమె యిట్లు మూర్ఛావస్థఁబొందె. నేనెంత యపకారి నైతిని !

చ|| తరుణిపయిన్ సఖీమణులు తామరతూండ్లను జేర్చి పూలెయా
స్తరణమొనర్చి క్రొన్ననలశయ్య యమర్చి సుగంధపూరితో
దర కదళీదళంబులను దారత వీచుచునున్నవారు ; సుం
దరి తనుకాంతిడిందె స్మరతాపమునన్ లతఁబోలె వాడుటన్ ||

కళా—మనోరమా! ఏలయిట్లు ప్రశ్నించితివే! కామభగవానుఁడా! నీవుదప్ప వేరు దైవము ప్రపంచమందు లేరు. ఈమెను దరుణమునఁ దేర్చితివా నీకుఁదగిన పారితోషికమిచ్చెదము (మ్రొక్కుచున్నది).

వసం—అయ్యో! చేతనారహితమగు కనకప్రతిమవలె నీమె యెట్లు పడెనో ? ఈమె శరీరవిలాసములెంత క్రమక్రమముగ క్షీణించుచున్నవో ?

చ|| తనురుచిమాసె ; హారములు దారవినీలతఁబొందె ; గండముల్
సునిశితకాంతివీడి కడుశోషిలి పల్చనయయ్యె ; హస్తముల్
గనలెఁ ; గుచద్వయంబు మృదులత్వమునొందెను ; వాడెఁగానుఁ ; గా
వున గురుతైనపట్టుటకుఁ బోలికయున్ గనరాదికెంతయున్ || ౫౫||

కళా—ఇఁక నేనొక యుక్తి పన్నెదను గాక-

మనో—ఏమి ?

కళా—సఖీ! “వసంతకుమారుఁడిదె వచ్చినాఁడు లెమ్మ” అని చెప్పినచో మాలతి తప్పక లేచును.

మనో—ఏదీ! చూతము.

కళా—మాలతీ! ఏల నీకు మూర్ఛిల్లెదవు. వసంతకుమారుఁడదుగో లెమ్మం.

మాల—(తటాలున లేచుచున్నది)

కళా—వసంతకుమారా! ఇటురమ్ము.

వసం—(తనలో) ఈమె నన్నుఁజూచియుండదు. (ప్రకాశముగా) ఏల నన్నుఁబిలుచుచున్నారు (మారువలుకుచున్నాఁడు) (అందఱు తెల్లబోవుచున్నారు)

(అంతట దుర్ముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దుర్ము—అమ్మా! మాలతీ! నాన్నగారు పిలుచుచున్నారు

మాల—(తడఁబడుచు) ఇదిగో వచ్చుచున్నాను (తనలో) మారుపలికిన యామహానుభావునితో మాటలాడు భాగ్యమందకుండ నిపుడీ మాలదైవము నాయాశ తరిమి ల్పించినాఁడు. అదృష్టహీనుల కంతకంటె నెక్కుడెట్లు లభించును? (ప్రకాశముగా) సఖులారా! రారే! వసంత సందర్శనముచే విరాజిల్లెడు నీసుమాకరము వీడఁజాలకున్నాను. తరుణమే వచ్చెదనుగాక. (నిష్క్రమించుచున్నది)

కళా, మనో — వేగవత్తముగాక: నాన్నగారి సెలవు మీఱరాదు గదా- (దుర్ముఖునితో నిష్క్రమించుచున్నారు)

వసం—ఆహా! వెన్నెలనుండి చీకటికి వచ్చినట్టులున్నది. ఇటులెంత సేపిచట నిలువఁగలను. ఇక్కడ కార్యార్థమై కొన్ని సాధనవిశేషములు కావలసియున్నవిగదా. మునిచంద్రుని యొద్దకుఁబోయి తెచ్చికొని వచ్చెదనుగాక.

(నిష్క్రమించుచున్నాఁడు)

గద్య- ఇది శ్రీమద్రమారమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానూనానురాగసూరమాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప తురగాస్వవాయాంభోధిసుధానిధాన వేంకటాచలాభిధానప్రణీతంబయిన మాలతీవసంత నామనాటకంబునందు ప్రథమాంకము.

# మాలతీవసంతము.

## ద్వితీయాంకము.

---

### రంగము—అరణ్య ప్రదేశము.

(చంద్రసేనుఁడు, వీరసేనుఁడు, వృషకేతుఁడు, సుమంత్రి, మైత్రేయుఁడును బ్రవేశించుచున్నారు)

సుమం—మహారాజా! చోరాపహృతధనునివలె నేలయింతదుఃఖ సముద్రమున మునిఁగి యున్నారు. నీకుమారునికావంతయైన యపాయముగలుగఁదని నమ్మెఁదు.

చంద్ర—అవును, నాయమూల్యధనము బోయెనే నేనుబిచ్చియెత్తి యిట్లు వెదకికొనుచున్నాను.

గీ॥ వంగదేశమహారాజవంశగర్భ
శుక్తిముక్తాఫలంబ దిచ్చోటగళిత
మయ్యెఁగావున దానికైయరయుచుంటి
ధనమువోవంగ దుఃఖంబుగనుటయరుదె ?

(కన్నీరునించుచున్నాఁడు)

మైత్రే—(నవ్వి) సత్యము లకేమిగాని యిట యింద్రనీలములు చాలఁ గన్పడుచున్నవి

(అని కాలినబొగ్గులు పట్టుకొనుచున్నాఁడు)

సుమం—ప్రభూ! నిజమే. అయినను మనకట్టిదురవస్థ ప్రాపించునా!

చంద్ర—సుమంత్రి! ఏమినీవెట్టి! మనమనగా నీఘోరమృగములకేమిలెక్క ?

సుమం—రాజా! అట్లుకాదు: ఘోరమృగములెన్నఁడు నీతనివధింపవు. ఏలననఁ బ్రతిమృగము నీతనియందు స్వజాతీయాంశముఁగని పెట్టి బంధుత్వమునెఱపును.

గీ॥ రాజసింహంబు వరమహారాజకుంజ
రంబు శ్రీరాజపుండరీకంబనంగ
వరలునీరాజబుపభు జీవనముఁగోరెఁ
గలుఁగునే! యెంతఘోరమృగంబులైన ॥

చంద్ర—సుమంత్రీ! నీయుక్తిసుధారసముచేఁ జిట్టముగట్టిన నాతనసు చల్లారునా!

మృగము లీతని ముట్టక పోయినను సర్వభక్షకుండగు హుతాశనుఁ డెట్లు లీతని వర్జించును ?

సుమం—రాజచంద్రా ! మహారాజ్యభారనిర్వాహక దోస్స్తంభుండగునని యొకింత యుండియు నాయగ్ని చేవుండే పసికాయను భక్షించి క్షుద్బాధ తానెట్లు తీర్చికొనగలఁడు ? దైవమనుటచే మహాభాగధేయులను నిరపరాధులను బాల్యులను నార్భకులను బాధపెట్టఁడు, కాలవశమునఁ బెట్టినసంతగా బాధింపఁడు.

గీ॥ చంద్రమతికారణమున నాజనకతనయ
మూలమున శాంతిఁబొందఁడేమును పువహ్ని ?
యట్లెయపరాధరహితుఁడై యడరుచుండు
మనవసంతునిఁ బసికాయ యనక దినునె ?

మైత్రే—బ్రాహ్మణుడనైన నన్ను నేమియు నెరుగని యతని నెవ్వరు స్పృశింపరు.

చంద్ర—మంత్రీ ! నీమాటలు కడుపీడించుచున్నవి. నన్నిఁకఁ బలుకరింపకుము. అగ్నిజ్వాలలవలెనే నాహృదయము శోకపరంపర చేరగులొ్కానుచున్నది. హా ! కుమారా ! మారసదృశాకార !

ఉ॥ విత్తులనాటి మొల్కలనుఁ బెంచి కుజంబులఁ జేసిమీదఁగా
పెత్తినపండ్లఁదిందునని యెంతయునూటల నూరుచుండఁగా
నత్తరివాతధూతమయి యయ్యదిగూలఁగఁ గాంచుకాపుదో
చిత్తను బెట్టులుండెడునొ చిట్టుముగట్టెను నట్లునీమృతిక్
బత్తినమొల్లి ; నొల్ల ధర ; భాగ్యములొల్లను నొల్లసౌఖ్యముల్ ॥

వీర—అన్నయ్యా ! వసంతకుమారుని కొరకు మీరంత దుఃఖింపవలవదు. తప్పకక యెక్కడనో యుండునుగాని యాతనికి మఱియొక భంగము రాకూడదు.

చంద్ర—తమ్ముఁడా ! ఏమినీ వెట్టినమ్మకము. అట్టిభంగము వచ్చిన యెడలఁ గర్తవ్యమేమి ?

వీర—అంతవచ్చినచో నేమి చేయగలము. దైవవికల్పమునకు వగచి మనసు కుదురుపరుచుకొనవలెను. పుట్టినవారందఱు బ్రతుకరుగదా !

గీ॥ కుజసముద్భూతమైన చిగుళ్ళలోనఁ
గొన్ని హరియించుఁ ; గాయలై కొన్ని చచ్చుఁ ;

గొన్ని ఫలరూపమునఁబోవుఁ గొన్నికడకు
నూటికొక్కటిగా నిల్చు మాటవినవె ?

చంద్ర—(వినుపించుకొనకయే)

చ॥ చపలవిలాసినిన్ వికచసారసనేత్రఁ గళావతిన్ మహా
నృపవరపుత్రి నొక్కతె నహీనముదంబునఁబెండ్లిజేసి యీ
విపులమహీతలేశపదవిన్ భుజసీమనునిల్పి కానలన్
దపమొనరింపఁగోర నిటు దైవమొనర్చెను భంగమక్కటా !

వృష—రాజోత్తమా ! అట్టిబన్నమెన్నటికిని రాదని మాకందఱకు మనోవాక్కాయకర్మములచేఁ దోచుచున్నది. ఇట్లు దైవమందఱకు నేకరీతిగాఁ దోపించుటచేత మనము కృతనిశ్చయులమైయుండనగును.

చంద్ర—ప్రియమిత్రా ! నీవుచెప్పినది సహేతుకముగా నున్నది కాదు. నలుగురకొక్కరీతిగాఁదోచినంతమాత్రమున నట్లు జరుగుననుటకేమి నిశ్చయము !

గీ॥ గోష్ఠమునువీడిపాఱిన గోవుకొఱకు
దక్షిణాభిముఖంబుగాఁదరలెననుచు
నరయుదురు నల్గురొకరీతి నంతమాత్రఁ
గనఁబడునెయద్ది తూర్పుకైచనఁగఁజెపుమ ?

వృష—రాజా ! అయినను నీవిషయమునమాత్రము మాకు గాఢవిశ్వాసము కలుగుచున్నది.

మైత్రే—అవును. జ్యోతిషగణితమువలన నాకు నట్లే తోచుచున్నది-

(మొగముపైకెత్తి లెక్కపెట్టుచున్నాఁడు)

చంద్ర—(దుఃఖముతో) హా ! మదీయగర్భజలధిచంద్రా ! కీర్తిసాంద్రా ! ఆమహారాజభోగభాగ్యంబులయందుండనీయక యీఘోరారణ్యంబులకు నిన్నేలఁదెచ్చితిని.

చ॥ చిఱుతతనంబువాని, రణసీమకుఁదెచ్చుటలేల ? తెచ్చినన్
సరభసవృత్తిమత్పురికి సాగక యీమృగయావినోదపా
మరమతిఁ జిక్కి పైమఱచి మత్సుతునొంటిగఁ బర్ణశాలయం
దరయక నిల్పనేల ? యకటా ! వికటంబులు దైవతంత్రముల్ ॥

సుమం—శాంతింపుడు- పుత్రశోకము గాఢాంధకారమువంటిది. అయినను గూడ నున్నవారలూరటబుచ్చి కొంచెము త్రోవఁజూపకతప్పదు.

చంద్ర—హా! కుమారరత్నమా! కడుపు దరికోసికొని పోవుచున్నదిరా!

చ॥ తెరఁగలఁగూడి పెల్లుబికి ధాత్రినిఁగోయుచు నెందఱాపినన్
మరలక పెంపుగాంచుచొకమారె తటాలునఁబొంగునట్టి పె
న్వరదయుఁబోలె నాయెద నవార్యపరంపరనుప్పతిల్లుదు
ర్భరతరదుఃఖవార్ధి నెటుబాల్పడి యీదెదువాఁడఁ బుత్రకా!

వీర—(తనలో) ఈతఁడీ దుఃఖముచే ముందు మృతినొందునట్లు కనఁబడుచున్నది. ఈప్రయాణము చివరకెట్లుముగియునో!

వృష—(తనలో) కుమారునితోఁగూడ నీతఁడును మరణోన్ముఖుఁడయియున్నవాఁడు దీనివలన మనకొక గొప్పలాభము ఘటింపవచ్చును.

సుమం—(తనలో) దీనివలన నీయనకేమి యుపద్రవము రాకుండ దైవము పుత్రభిక్ష పెట్టుఁగాక.

మైత్రే—(తనలో) ఈయన గతించినచో నన్నవస్త్రములకులేక నేనునుబోవలసినదే.

చంద్ర—ఓరికుమారా! ఒకవేళ పట్టణముచేరిన యెడల నీజనని మనవసంతుఁడేఁడని యడిగిన నన్నేమిచెప్పుమంటివిరా! మాకంటె ముందే నీవుబోయి మాకు దారి జూపుదువని మేము కలనైన ననుకొనలేదు.

చ॥ పుడిసెడునీళ్ళుబోసి మముఁబున్నరకోద్ధరణంబొనర్చి యీ
వుదుగత మాకు సద్గతుల నొందఁగఁజేయుదువన్న నమ్మికన్
గడుమదమొందినారమటుగాకపసవ్యపురీతి నీకెయే
మడరుచు దర్భివాపజలమావిధి పోయఁగఁజేసెఁగూళయై॥

అన్నా! నాయెడల విధికిఁ దోడుగా సర్వమును విషమములే యయ్యెను.

శా॥ * ఆలంబయ్యెనుబుత్ర! నీభుజననంబౌనప్డు జ్యోతిష్కులా
కాలంబెంచి గ్రహస్ఫుటంబయిన చక్రంబొక్కటింగీసి వీఁ
డేలున్ బృథ్విని డెబ్బదేండ్లుపయిజీవించున్ బదావేడులం

---

* పరిహాసమని యర్థము.

చోరింబల్కుట ; శాబ్దద్రవ్యహరణోద్యోగంబులీశాస్త్రముల్ ?

మైత్రే—రాజోత్తమా! శాస్త్రంబులదూషింపక నామాటలు నమ్ముము. నీకుమారున కేయుపద్రవమునురాదు. కనఁబడినపిదప నన్నుమెచ్చుకొందువుగాక.

(అదృశ్యుఁడై మందస్వరములో సుముఖుఁడుప్రవేశించి యందఱను నిద్రాసక్తులఁజేసి పోవుచున్నాఁడు)

సుమం—మైత్రేయా! నీకు నిద్దురచేఁ గండ్లు మూతలు పడుచున్నవి. వందుకొమ్ము. నేనును గొంచెముసేపీనేల వ్రాలెదను.

మైత్రే—మంచిది. నాకు నిద్దురగలిగినచో భోజనమైన నక్కరలేదు.

(మైత్రేయ సుమంత్రులు నిద్రించుచున్నారు)

చంద్ర—(వారివైపుజూచి) అట నిద్రించువారినిఁజూచి నాకసూయ కలుగుచున్నది. అంతభాగ్యము నాకుఁగూడ నెన్నటికైన లభించునా? దుఃఖభాజనులను నిద్రాదేవి యాశ్రయింపదు. అన్నా! వారికి క్షణములో నిద్రపట్టినది.

వీర—ప్రభూ! అసుఖమెంతకల్గనున్నను గష్టవశమయమున వీడఁదగదు. దుఃఖావహుల న్నూరార్చుటకు నిద్రఁబోలువస్తువు మఱియొండులేదు.

వృష—మహారాజా! ప్రియత్నించియైనను నిద్దుర తెచ్చికొండు. వచ్చినచోఁబోనీయకుఁడు. మీరునిద్రించుకాలమునఁ గృపాణపాణులమై మేమిరువురమును మిమ్మసురక్షితగాఁ గాపాడగలము.

చంద్రి—నిండుబడలికచేఁ గనుఱెప్పలు మిక్కిలి బరువుగానున్నవి. నేనునిద్దురతెచ్చికొనుటకుఁ బ్రియత్నించెదనుగాక. దయచేసి మేల్కొనియుండుఁడు.

(వ్రాలుచున్నాఁడు)

వీర—వృషకేతూ! చూడుము. వీరలందఱెట్లు నిద్రాసక్తులయిమత్తుమంత్ర చల్లినట్లు పండియున్నారో!

వృష—వీరసేనా! అది యీస్థలమాహాత్మ్యము.

వీర—అదియేమిమాట. అట్లయినచో మనకేల రాకుండును? నాకు నిద్దుర యించుకయులేదు,

వృష—అవును నాకునులేదు అశనిపాతముచేఁగూలెడు వృక్షరాజివలె వారెట్లు

గూలిరో! (నవ్వుచు) వీరసేనా! వహ్వా! ఏమిటి. (తలపంకించి) అవును. ఇఁకముందు నీవెంతవాఁడవు గానుంటివో ప్రస్తుతస్థితిని బట్టి నేను యోచింపఁగలను (ముఖము పరికించుచు) పూర్ణముగా నాలోచించినచో నీకొకమహారాజయోగముకలదని నాకుఁదోచెడిని.

వీర—వృషకేతూ! నీధోరణిచూడఁగా నీవు కూడ నిద్రాగతుఁడవుగా నున్నట్టులున్నది.

వృష—ఓయీ! నేనుమేలుకొనియే తెలివిగా సంభాషించుటలేదా! పలవరించుచున్నట్టులే యున్నదా!

వీర—నీవు తెలివిగా సంభాషించుచున్నను మాటలు మాత్రము నిద్దురమొగముగా నున్నవి.

వృష—నామాటలు నిద్దురమొగముగా లేవుగాని నీభాగ్యలక్ష్మి గొంచెము నిద్రావస్థలోనున్నది. నీవుజాగరూకుఁడవై యున్నపుడు దానినట్లు నిద్రవుచ్చనేల?

వీర—వృషకేతూ!

గీ॥ ధ్వన్యలంకారభరిత సత్కవిసుపద్య
రచనఁబోలు భవద్వచోరచనలెల్ల
సత్కళాగంధహీనుఁడౌ జడునికెటుల
గ్రాహ్యమదిగాదొ నాకు నగ్రాహ్యమివియు॥

వృష—గీ॥ భేరికాధ్వనిలనదలంకారములును
గలిగి విలసిల్లునాఁడైన గ్రాహ్యమగునొ
లేదొ యోవీరసేన! నిర్లిప్తబుద్ధి
నాదరింతువొ! నన్నుఁబోనాడనెంతొ!

పరుల నిద్రావస్థలవలన జాగరూకులకెంతలాభ ప్రాప్తియగును!

ఉ॥ నద్దానరింపకుండిన యసాధ్యపుటంతిపురాలనుండు నే
ముద్దియనైనఁగూర్చును నమూల్యధనంబునుఁ జేర్చు; దిట్టకున్
నిద్దురయొక్క వేళ నవనీధరభోగఫలంబొసంగెడిన్
నిద్దురదెచ్చులాభమవనిన్ మరియెద్దియొసంగు మిత్రమా!

వీర—(తనలో) వీనితలఁపు నాకుఁదెలిసినది. చంద్రసేననిటఁగడితేర్చి నన్ను రాజు

భర్తగాఁజేసి నావలన లాభమొందుటకుగానున్నది. అక్కా! దుర్మార్గతలో వీఁడు నన్నుమించెనే! కానీ! సిరిరా మోకాలొడ్డనేల? (ప్రకాశముగా) ధనార్జనయుఁ బరకాంతాసుఖంబులును బుద్ధిమంతునకు మహారాజ్యపదవియుఁ గూడ నిద్రవలననే వచ్చునంటివి మొదటి రెండు నప్రస్తుతప్రశంసయగుటచే మనము ధ్వానినిగూర్చి యోచింపవలసిన పనిలేదు. ధైర్యసన్నద్ధుఁడయినంతమాత్రమున,

గీ॥ ఒకరిరాజ్యరమాసతి నొకరినంటఁ
జేయఁదరమానె వగలపాల్పేతగాని
జలదవీధిని సౌధరాజంబుగట్టఁ
దలఁపుఁగొనుమాత్రనగునె ఖేదంబుగాక॥

వృష—వీరసేనా! నీవుచెప్పునది సాధారణజనులకుఁగాని మనకుఁగాదు.

గీ॥ ధైర్యహీనతచేతనేతలపులెన్నొ
సిద్ధిదంబుగనున్నఁజెడుటవినవె?
లోకులనీళ్ళకుఁబోయి తానీతనేర్వఁ
దలచియొడ్డునమున్గు నధైర్యపరుఁడు.

వీర—వృషకేతూ! ప్రియమిత్రా! నీముఖవికాసములును నీవచోనైపుణ్యములను జూచఁగ నేదియో యొకగొప్పసంగతి మనోంతర్గతమైయున్నదని తోచెడిని దానివెలిఁబుచ్చి నాకు శ్రోత్రపర్వంబొనర్పుము.

వృష—(తనలో) నాతలంపులన్నియు వీనికిఁదెల్లమయ్యెను. లేకున్న 'ప్రియమిత్రా' యనియు, "శ్రోత్రపర్వంబొనర్పుమ"నియువచించునా! ఇఁక మనము దాపనవసరము. (ప్రకాశముగా) వసంతకుమారుఁ డింకను జీవించియుండుననుదువా? సుమంత్రికిమాత్రము వాఁడుజీవించునను ధైర్యముగలదుసుమా!

వీర—(తనలో) వీఁడు మహానిపుణుఁడు (ప్రకాశముగా) నీయభిప్రాయమేమి?

వృష—నాకాతఁడు జీవించుననుట సందేహము.

వీర—నాకు నట్లేతోచుచున్నది. నాకాసుమంత్రి ధైర్యమువట్టి నిరాశగానున్నది.

వృష—ఆనిరాశనుండియే నీకుఁగల గొప్పయాశలు నెరవేరఁగలవు.

వీర—ఎందుచేత?

వృష—అతఁడస్తమించినయెడలఁ జంద్రసేనుఁడు కూడఁబోవుననుట నిశ్చయము.

వీర—కానిమ్ము- అట్లయినచో,

వృష—ఈవంగరాజ్యాధిపతి యెవఁడు కాఁగలఁడు ?

వీర—(గంభీరతతో) ఏమి ! నీకాసందేహ మేల? సౌరాష్ట్రదేశ మహారాణియగు వసంతతిలకయను చంద్రసేనుని కూఁతు రేమయ్యె ?

వృష—అది వెఱ్ఱిమాట వంగదేశమునకును సౌరాష్ట్రమునకు రమారమి నూరు యోజనములుగలదు. మనగుట్టుమట్టుల గనిపెట్టి వారుదండెత్తి వచ్చి జయింపఁదల చుటకలలోనివార్త.

వీర—ఆమెయే యన్నివిధముల నర్హురాలు. అంతకంటె నీకె నన్యు లెవరు ?

వృష—ఎవరననేల! నానోట పలికించవలెనా ? సుమంత్రి మంత్రిపదమునకు నేన ర్హుఁడనుగానా ?

వీర—బాగుగానున్నది. (నవ్వుచున్నాఁడు)

వృష—ఇదినీకు సమ్మతమగునా ?

వీర—(సహర్షుఁడై) గీ॥ ప్రాజ్యరాజ్యంబునుండి నీభ్రాతృవరుని
నీవు దొలఁగించి రాజౌట నిజమె చెపుమ ?

వృష—(సంతోషముతో) కాకయున్నను నాకీయఖండరాజ్య
భారవహనంబుగల్గునే ? వీరసేన ?.

వీర—(సాంగీకృతుఁడై) అవునుగాని నీయంతరాత్మ యీపాపకార్యమున కెట్లొడి గట్టినది.

వృష—(ధృఢచిత్తుఁడై) ఓయీ ! వీరసేన ! అదినాకున్న జాడయే లేదు. నాకును నన్ను తలుచు బాడగట్టుచుండును. అదియేమనకుఁ బ్రధానము. చూడుము. చంద్రసేనుఁడు గాఢనిద్రావశుఁడై యున్నాఁడు. ఒక్క కృపాణఘాతచే నాత నిఁబెద్దనిద్దురఁ బొందునట్లు చేయవచ్చును. బృహస్పతిఁబోలు నీసుమంత్రిని నీవొ క్కదెబ్బచేఁ బరమపదమును బొందింపఁగలవు పిదప నంతయు మనచేతిలోనిదే.

వీర—అన్నా ! నీకుఁ గళింగదేశములభించునట్టుల నాకు వంగదేశములభించుఁగాక. ఈవిషయమునందు నీయాజ్ఞాబద్ధుఁడనగుదును నీకత్తినారదీయుము. నీకిఁకఁ గ ప్పముగట్టుబాధ తగ్గుఁగాక.

వృష—(కృపాణహస్తుఁడై) గీ॥ రాజమస్తంబు నాదునిర్వక్రసునిశి

తాసి నెప్పుడు ఛేదింతునన్నై నీవు
మండలాగ్రంబుచేత సుమంత్రిశిరముఁ
గోయుమా! వీరసేన! యుపాయమరసి॥

వీర—(రహస్యముగా) ఇదిగో! మాట (చెవిలోఁ జెప్పికొనుచున్నారు). [ఇద్దఱు క త్తులు నొరదీయుచున్నారు]

(అదృశ్యుఁడై సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుము—నాగురుచంద్రుఁడీ దుర్మార్గులుచేయు నకార్యకరణము నంతర్వీక్షణ కళాప్రభావముచే గ్రహించి తనతలఁపునకు విఘ్నమగునని నన్నిటకుఁ బంపినాఁడు గదా, వీరినిఁకలేపి సంరక్షింపవలెను.

గీ॥ ఒడలెఱుంగక నిద్దురఁబడినమిమ్ముఁ
గత్తులనుబూని చంపంగఁ గడఁగినారు
దుష్టు లిరువురుగానఁ దోడ్తోనలేచి
కాంచుఁడీవీరి పాపసంకల్పవృత్తి॥

(అని సుమంత్రిచెవిలో నూఁదుచున్నాఁడు)

వృష—వీరసేనా? ఆలస్యమేల? మనమతిశీఘ్రముగా నీపని నెరవేర్పవలెను. కానిచో విఘ్నములు రాఁగలవు.

సుమం—(ఒడలు విరిచికొని యావులించి చిటికెలువేయుచు) అన్నా! ఏమి కలతనిద్దురయయ్యెను. (భయముతో) దేవతలారా! రక్షింపుఁడు, మహారాజును రక్షింపుఁడు.

మైత్రే—(కేకలుపెట్టుచు) మాయమ్మను నేనొక్కఁడనే రక్షింపుఁడు.

చంద్ర—(లేచుచు, నులికిపడి) ఏమిటిది! నిద్రాభంగమయ్యె, మీరలీకత్తుల నొరదీసియున్నారేమి! ఇంత నిశ్చేష్టులై నిలువఁబడి తెల్లఁబోయిచూచుచున్నారేమి!

సుమం—వీరసేనా! యేమి యీచిత్రము! మాట్లాడరేమి?

వీర—అయ్యా: మీరు నిద్రించుచుండఁగా మిమ్ములఁగాచికొనియుంటిమి, అంత నేమియో సింహగర్జల వలెను గజఘీంకారముల వలెను గొన్నిధ్వనులు బయలుదేరి మమ్ముభయపెట్టినవి. దానివలన నేకదా మీకు నిద్రాభంగమయ్యె, మాకుఁ గర్ణకఠోరములయ్యెను.

చంద్ర—(ఆశ్చర్యముతో) నాకేమియు వినఁబడలేదే.

వృష—అబ్బా! ఆధ్వనులు రాక్షసులకైనను భయము పుట్టించును. గాఢనిద్రలోనుం డుటచే మీకు వినఁబడలేదు.

చంద్ర—సుమంత్రీ! నీకు వినఁబడెనా?

సుమం—రాజచంద్రా! తుమ్మెదల ఝుంకారారావమువలె నపూర్వధ్వని యొకటి నాకర్ణపుటంబులఁబడి నన్నులేపినది. నేను లేచుతోడనే కృపాణపాణులైన వీరు బాడగట్టిరి. ఇఁక మనము తగనజాగ్రతగానుండవలెను.

చంద్ర—సరే! అయిన దానికి వగవనేల? ఇఁక ముందునకుఁ బోయి నాకుమారుని నన్వేషింతముగాక.

సుమం—ఈ యరణ్యములో సురక్షితముగా నుండు నతని ఘోరమృగాదికములు రక్షించుగాక. (నిష్క్రమించుచున్నారు)

సుమ—నేను చేసిన ఘనకార్యమును గ్రహించి నాగురుచంద్రుఁడు నన్ను కృపాదృష్టి వీక్షించుగాక. (నిష్క్రమించుచున్నాఁడు)

---

ప్రదేశము ii ఇంకొక యరణ్యసీమ.

---

(కుశసమిత్ఫలావళులచే నింపఁబడిన యొక పెద్దసంచితో దుర్ముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దుర్ము—(దుఃఖముతో)

సీ॥ నరులఁబీడించు నానారోగసంఘంబు చిత్రకేతునిఁజంపిచీల్చుఁగాక
సంవర్తమృత్యుదంష్ట్రిలె నొడల్ బడుచు బాధించిబాధించివధించుఁగాక
సర్వభక్షకుఁడైన సప్తజిహ్వుండు దానొక్కముద్దకుపీని మెక్కుఁగాక
ననుబాధపెట్టునాతని గ్రహావళి వానినెదిరించిపోరిహింసించుఁగాక

గీ॥ ఎంతగొల్చినఁగరుణయొక్కింతలేక
యింతలోపంబుగల్గుచో నెంతోచేసి

చీటికిని మాటికిని బాధచేయఁబోలు
గ్రహములన్నింటి; నిట్టిదుర్జనునిఁగొల్చు
కన్న పాపంబుగలదె జగంబునందు? ॥౨౦॥

(విలంబుఁడు ప్రవేశించుచున్నాఁడు)

అదిగో దర్భాదులవేగఁ దేకుంటిననికాబోలు నాతని గ్రహమొకటినన్నుఁ బీడింపనిటువచ్చుచున్నట్టులున్నది. దానికిఁ గనఁబడకుండ భూమినంటికొనిపడియుండెదను. (పడుకొనుచున్నాఁడు)

విలం—అన్నా! బమ్మమాయలు. కార్చిచ్చువోఁగా నేరాళ్లవానబయలు దేరి కుండలతోఁ గుమ్మరించినట్లుకురిసి కాలుచున్నమోడు చెట్లనార్పుసుడిగాలితోఁ గలిసి నాకుఁజలి దెచ్చిబాధపెట్టుచున్నది. ఒడలంతయుఁ దడిముద్దయయిబిరుసువారి కట్టెముక్కవలెనున్నది కప్పుకొనుటకు దోసెడుగుడ్డయయినను లేదు. ఆకలిచేనసురెగిరిపోవుచున్నది. దప్పిచే నాలుక పిడచవారియెండికొనిపోయినది. నేనుదొంగతనముగాఁ దెచ్చికొని దాచికొన్న సారాకాయలలోనికి రెండుమాత్రమమిగిలినవి. నేలపాలగు నేమోయనుభయముచేఁ జూచిచూచి వానినిదాగిలేను ఇక్కడ వెదకినను నేమియుఁ గనబడదు. (పారఁ జూచి) అదేమియో! నరకాయమా! లేకనిప్పులలోఁ జిక్కగానుడికినయేదైన మృగమా! మృగమైనమిగులసంతసింతునుగదా! కార్చిచ్చునకుఁ బిడుగులకును జడిసిన బోయవాఁడుకాఁడుగద. (సమీపించి) అవును అయ్యో! పెద్దవానమిన్నువిరిగి వచ్చుచున్నట్టులున్నది (వడకుచు) యెక్కడదాగియుందును. వీనిదగ్గర పెద్దనంచియొకటియున్నది. వాఁడునుదూరుచున్నాఁడు. ఇదియేసమయము. (పరుగెత్తిదూరుచున్నాఁడు)

(మైరేయుఁడు కల్లుద్రాగియొడలెఱుంగక సీసాకాయచేతఁబట్టుకొని తప్పుడుపదములఁ బాడుకొనుచుఁ బ్రవేశించుచున్నాఁడు)

మైరే—కల్లుకంటెమంచివస్తువు లోకములోమరియొకటిలేదు. కాఁబట్టియే దేవతలు కూడ దీనిని ద్రాగినారని చెప్పుదురు. దీనియందుఁ జాలమహిమగలదు. ఇదిత్రాగినతరువాతజగమంతయుఁ దిరిగియనేకమూర్తులుగాఁ గనఁబడును. (అనిచేతికాయనుఁ బీల్చుచున్నాఁడు)

దుర్మ—(నంచిలోనుండి) ఓగ్రహమా! నన్నుఁ జంపకుము. ఇదిగోపండ్లను దర్భలను

గొని వచ్చినాను.

మైరే—ఏమి. ఇక్కడ దయ్యములుగూడ నున్నవి కాఁబోలు.

దుర్ము—ఓభగవంతుడా! ఈగ్రహమునుండి నన్నురక్షింపుము.

మైరే—(కట్టగానున్న దుర్ముఖ విలంబులనుఁజూచి యొక్కఁడే యనుకొని) ఇది యీయడవిలోఁ జెరిగిన యొకపెద్దరక్కసి కాఁబోలు. దీనికి నాలుగు కాళ్లుగలవు. జ్వరముచేత నిటునటు కొట్టుకొనుచున్నది.

దుర్ము—(హీనస్వరముతో) ఓదయ్యమా! నన్నుబాధపెట్టకుము. రేపటినుండియన్నియు త్వరలోఁ దెచ్చెదను.

మైరే—(విని) ఈమంచిసారా వీనినోటిలోఁ బోసిచూచెదను. ఇదివరకుఁదాగకున్న ను రుచించువస్తువుగదా!

దుర్ము—నిన్ను నేనెరుగుదును. జిత్రికేతుఁడువంపినాడు. లేచిపొమ్ము.

మైరే—ఓయిరాక్షసా! తిన్నఁగాఁ బండుకొని నోరు తెరువుము. ఇది నీవడకుపోఁ గొట్టును.

విలం—వీనిమాట నేవినినట్టులున్నది. మైరేయుఁడైనయెడల నింకనుజీవించియుండునా?

మైరే—ఇది చిత్రముగానేయున్నది. ఈకాయమునకుఁ గాళ్ళు నాలుగు. గొంతుకలు రెండు. మొదటిగొంతు దూషించుచున్నది. రెండవది యాదరించుచున్నది. (సమీపించి) నోరుతెరువుము. అమృతము పోసెదను.

విలం—మైరేయా! ఏమోయి, బాగున్నావా?

మైరే—రక్కసా! నీరెండవగొంతు నన్నుఁ బిలుచుచున్నదా?

విలం—నీవు మైరేయుఁడవైనయెడల నన్నుఁ గౌఁగలించుకొని నాతోమాట్లాడుము. నా పేరువిలంబుడు.

మైరే—నీవు విలంబుఁడవేయైనయెడల వెలికిరమ్ము. ఈపొట్టికాళ్ళురెండు వట్టిలాగుదునా! ఇవి నీకాళ్ళులాగుననున్నవి.

విలం—ఇంకనుజీవించియున్నావా?

దుర్ము—(తనలో) ఇవి గ్రహములు కానిచోఁ జిత్రమైనవస్తువులు (మైరేయునిఁ జూచి) దివ్యామృతము, చేతఁబూనిన దేవేంద్రుఁడితఁడు. నేనతనిఁ బాదాక్రాంతుఁడనయ్యెదనుగాక.

మైత్రే—బహుప్రయాసములమీదఁ దప్పిజారిబ్రతికినాఁడను.

దుర్ము—(మైత్రేయునితో) అమృతధారివైననీకుఁ బరమవిధేయుడనగుభృత్యుఁడను

మైత్రే—పరమసమ్మతము. నీవుదాసుఁడవేయైనచో నాకు మ్రొక్కుము.

(దుర్ముఖుడులేచి మ్రొక్కుచున్నాఁడు విలంబుఁడు లేచుచున్నాఁడు)

విలం—ఇంకనుఁ నీదగ్గర యీవస్తువులు సేకరించితివా?

మైత్రే—ఇఁకగొంచెమున్నది.

దుర్ము—ఓమహానుభావా! నీకు నీయరణ్యమందుగల మాయలను గనవచ్చెదను నా కూడరండు.

విలం—(తనలో) మైత్రేయ వశులునింత గొప్ప చేయుటచే వీఁడొక తెలివితక్కువవాఁడుగా నున్నాఁడు.

మైత్రే—ఓరీ! మమ్ము నీవుచెప్పిన తావులకుఁ గొనిపొమ్ము- ఇఁకమాట్లాడకుము. విలంబా! చంద్రసేనుఁడును దక్కినవారును చచ్చిపోవుటచే మనమిక్కడ నివసింతము- ఓరీ! నాసీసాకాయ పట్టుకొని నాకూడరా!

దుర్ము—(తప్పుడుపదములఁ బాడుచున్నాఁడు.)

విలం—పానమెక్కుడైనట్టు ఉన్నది.

దుర్ము—నేనీదినమునుండి స్వేచ్ఛావిహారి నౌదునుగాక.

మైత్రే—ఓరీ! దారిచూపుము రా. (నిష్క్రమించుచున్నారు.)

గద్య- ఇది శ్రీమచ్ఛ్రీమారమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానూనానురాగనూరమాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప తురగాస్వవాయాంభోధిసుధానిధాన వేంకటాచలాభిధానప్రణీతంబయిన మాలతీవసంత నామనాటకంబునందు ద్వితీయాంకము.

# మాలతీవసంతము.

## తృతీయాంకము.

---

[వసంతుఁడు నీళ్ళకావడితోఁ బ్రవేశించుచున్నాఁడు]

వసం — ఉ. శోకపరీతముల్ గదవ సుంధరయందును గ్రీడలైననా
జ్ఞాకలితంబులౌటను ; మనఃప్రియమానటులయ్యుమందుశో
భాకరసౌఖ్యమబ్బునను నాసతలంపునఁబుట్టియున్న ; నా
రాకరుఁగాదె చేయుదురు రాజులుసైతము నీచకృత్యముల్.

ఇప్పుడుచూడుము- ఉద్యానవన విహారోద్యోగంబునఁ బూఁదోటలమధ్యఁ దిరుగుచు సుగంధవాయువుల నాఘ్రాణించుచుండుట మహారాజకుమారులకు యుక్తకార్యమయినను నీమున్నాజ్ఞాబద్ధుఁడనయి నీరుదోడుపఁకి నియమింపఁబడుటచేఁ గ్రీడావిలాసాకరమగు పుష్పితారామమునను నను గష్టతరమగుచున్నది. అయినను భావిసుఖమగు నాచంద్రానన తోడిపొత్తు నీకష్టమునంతయు సుఖముగా మార్చివేయుచున్నది- ఇదియునుగాక,

గీ. ఆదినైచ్యంబులగుపనులంత్యమునను
హెూన్నతఫలంబులిడుటచేనొప్పిదమగుఁ
బలుదెఱంగులఁబంటలుపండునసుచుఁ
గప్పరేభూమినెరువుచేఁగావులెల్ల ?

కావున నాపద్మాకర నాహృదయకమలపీఠికనుండి మంత్రదేవతవలె నన్నుత్సాహపరుచుచుండుటచేత నతినైచ్యంబునకు లోనైయున్న నాకునంతయునున్నతమహాపదవివలెఁ గనఁబడుచున్నది- ఆమె రూపరేఖావిలాసంబులెంత మోహజనకంబులుగానున్నవో యంతకునినుమడిగా నామె గుణాతిశయంబులు బొడగట్టుచున్నవి- ఏలననఁగా నన్నుమరిమరి పీడించుచున్న తనతండ్రితోడఁ దనమాట పాటింపకపోయినను ననేకమాగణంబుల మనవిచేసి నాక్షేమముగోరునా ? కోరదు. అదిగాక నాయదృష్టమేమియోగాని నన్నుఁ గాంచినప్పటినుండియు నాయసామాన్య లావణ్యవిలాసినికి నాపైఁ గడునిష్టము గలిగినట్లున్నది- మొదట వేరొండుగాభావించితి- అదిసరికాదు- కాఁబట్టియే తనతండ్రి నేనుండుస్థలము వీడుమని కఠినాజ్ఞ యిచ్చినపుడామె పోవుచు,

గీ ఆడుగులిడలేక యెడమెడనాగియాగి
తనదువీణియయెటనున్న దనుచునడుగు
నెపమునను దాను మరలికన్నీరులొలుక
వచ్చునే నాకు నేత్రోత్సవంబొనర్ప ?

ఆకృతియంతయు నాకుఁ గన్నులయెదుటఁ గట్టినపటమువలె నున్నది- కన్నీటితో) ఈమాలతీ లతాగృహాంతరమునఁ దత్ప్రతిబింబమును లిఖింపఁ గొంతహృదయము శాంతిపరచెదనుగాక- (వ్రాయుచు) బహుశః యీపీఠమునందు నాచంద్రాస్య తనతోడి చెలులిర్వురు నర్హములగు నీయాసనములందుండగా నలంకరించునుగాబోలు- ఆమె యిందుండునని తలఁచుకొనఁగానే యొడలు పులకాంకురితమగుచున్నది- నిజముగా నున్నయెడల నే నెంతపరవశుఁడనగుదునో ? ఈయారామసీమ యెంతశోభిల్లునో ? ఆమె లేకుండుటచే

క. ఇందుశిలాఘటితంబిది
యిందువదన లేమిఁ జేసియింపలరదు నా
డెందమునకు ; సకలసుఖా
నందంబగు గేహమలరునా ? సతి లేమికా.

వీణియ యెటనున్నదని యడుగుటచేఁ దానుగానకళాప్రవీణనని చాటుచున్నది.

క వీణియఁగొనియీప్రమదో
ద్యానలతావళిచిగుర్పదర్పకరతమౌ
గానంబానతిపాడఁగ
వీనులకునువిందొనర్పవినుటెన్నఁడొకో !

అన్నా ! ఈమోహసముద్రములో మునిఁగియుండుటచే నేఁజేయవలసినవిధుల ను మరచినాఁడను- ఆమహాత్ముఁడిది తెలిసికొన్నచో నవిధేయుఁడనని యెంచి నన్నీపద వినుండి తొలగించి శిక్షించునేమో ! నాకిదిపోవుటకంటె జీవములు పోవుటమేలు. (కావడినెత్తి) ఇఁక సత్వరముగాఁ బనిచేయవలెను- ఓహో ! ఈవనమెంత రమణీయముగానున్నది.

మ, ఇదె ద్రాక్షాలతికాళి ; యీవలితలంబే పారిజాతౌఘము ;
య్యదియే మావులగుంపు ; నాపయినిదివ్యామోదసంఘాతసం

వదలింపొందఁగఁ జెంపుదాల్చునలసంపంగుల్ జెలంగుఁగన్ ; బయిన్.
బొదలున్ బాటలపత్త్రినందనవనంబున్ మీఱియుచ్చోటునన్.

(అని కాలువలుదీర్చి తడపుచు) నేనీనిత్యకృత్యమును జేయుచున్నప్పుడా మానినీమణి యిటకువచ్చినను నాకవమాన మించుకయయిన నుండదు. అయిన నామెజాడయే లేదు. ఇదిగాక నాకొక గొప్పసంశయము లోనఁబీడించుచున్నది. ఏమియన నామె కులగోత్రము లింతవరకు నాకుఁదెలియవయ్యె.

గీ. భిల్లవనితామతల్లియైయుల్లసిల్లె
నేనిబూడిదెలోని పన్నీరుగాదె
యతివజన్మంబు నాదుమోహంబుగూడ
నేలయట్టిగుణ్యఖిచిహ్నలిట్టులుండ ?

ఈమె నేననుకొనినట్లుగాక బ్రాహ్మణతాపసకన్య యయినచో నచింతనీయమేగదా.

గీ. తాపసాత్మజయైనయధర్మమౌను
రాజపుత్రికకంటెనీరాజవదన
దేశకాలవశీకృతదేహయగుట
నిట్టులుండెనుగాని వేఱేలయగును ?

కాఁబట్టి కార్యసాఫల్యమగునను దృఢనిశ్చయముతో.

ఉ. కాయలుగాయమాపుఁబయిఁగావడిఁబెట్టిజలంబుప్రోయఁగా
ర్యాయతరశ్మిసంభవశ్రమంబుకతార్ద్రనవాంగకంబుపై
పాయియొనంగుమారుతములల్లనసోకఁగవజ్రదేహినై
యీయెడనంచరింతుఁగమలేక్షణపైఁగనులన్నిగుడ్చుచున్.

(అని చెమ్మటలతోఁ బనిచేయుచున్నాఁడు)

(అంతట మనోరమాకళావతీ సహితయై వీణాపాణియైన మాలతి ప్రవేశించుచున్నది.)

మాల — సఖీ ! సుమనోవసంతుఁడగు వసంతుఁడెటనున్నాఁడో.

కళా — మాలతీ ! అతఁడే చెట్లచాటుననున్నది మనకుఁదెలియదు. కావుననే నొక్కయుక్తి చెప్పెదను. వసంతసహకారుఁడగు మలయపవనుఁడు మనకును సహా

కుండగునట్లు నీగానవిద్యాశిక్షణము కొంచెమగుపర్చితివా యాతఁడేగి వసంతునిఁ గొనివచ్చును.

మనో—సఖీ! ఇది మంచియుపాయము.

మాల—అట్లయినచోఁ బ్రారంభింపుఁడు. నేనువినెదను.

కళా—అట్లుగాదు నీవే మొదలుపెట్టుము.

మాల—దేనిని?

కళా—కళ్యాణమగు కల్యాణీరాగమును.

మాల—(చక్కఁగాఁ బాడుచున్నది)

కళా—(వీణెకు శ్రుతివేయుచున్నది.)

వసం—(దూరముగానుండి విని) ఓహో! ఇచటి శీతలగంధవహుఁడు సుగంధజనిత సుఖమునకుఁ దోడుగా నాకీ గానసుఖముగూడఁ గల్పించుచున్నాఁడు. మహాసత్త్వుఁడగు నాదేవుని సహాయము కలుగుటచే మరివేరుభయము నాకులేదు. (ఆశ్చర్యముతో వినుచు) ఇదియేదివ్యగానమో! ఇది యెటనుండి వచ్చుచున్నదో! (ఆలకించి) అనంతకల్యాణదాయకమగు కల్యాణీరాగముగాఁబోలు పాడుచున్నారు. ఇట్టిగానము నేనెన్నఁడు విని కని యెఱుగను.

ఉ. వీనులవిందొనర్పఁగ నవీనసుగాయన గాయనీమణుల్
వీణెలఁబూనికంబముల వింతచిగుళ్ళెగురించురీతినా
స్థానమునందుఁబాడు వరదర్పకగానము లింతహృద్యమై
తేనియసోనలై విపుల దివ్యవిలాసములై కరంచునే?

ఏదియేమైనను సరే; నేనాగానము వినవచ్చుతావునకుఁ బోవఁ బ్రియత్నింతునుగాక (నడచుచు) గుమ్ముగుమ్మను నెత్తావుల వెదఁజల్లుచు సర్వదుఃఖాపనోదకంబయి తుష్టిప్రదమైన సపనయించు నీక్రొమ్మావిగుబురులును నీయశోకలతా వితానంబులును నీరంభాస్తంభసముదయంబులును జూడనాగానమేదిశనుండి వచ్చుచున్నదో తెలియరాకున్నది.

ఉ. గానకళామహత్వపరికల్పితమార్గణము నంటమానుచు
ధ్యానమదృశ్యమయ్యెడిఁ బృథగ్స్వరమొండు వినంబడుఁ గుకీ
స్వానమొ! కేకినీరవమొ! పంచమసుస్వరమో! విపంచికా

ధీనరవంబో గాని మదిఁదెల్లముగా దెట బోదునిందుఁగ?
అయిన నీమాధురీధురీణావము నన్నాకర్షించుచో టిక్కి బోయెదనుగాక.

[కళావతి వీణె వాయించుటకూడ మానుచున్నది]

మాల—కళావతీ! నీప్రయత్నము లేమయిన ఫలమిచ్చునా?

కళా—(పరికించుచు) ఏలసందియము? నీకళావిశేషములకు నయస్కాంత సన్నిధి యగు సూచీముఖంబునుంబోలె వీరాకుమారుఁడు గడుఁజొక్కి దారితెలియక యీలాగుననే కడకు వచ్చుచున్నాఁడు.

మాల—సఖీ! వీణవాయించుట మానితివేమి? పాపము నిరాధారుఁడై యతఁడెట్లు మనలఁ జేరఁగలుగును?

కళా—చెలీ! మరుదీమమైన నిన్నెట్లయినఁ జేరునుగాని చేరకపోడు- త్వరపడకుము

మనో—కళావతీ! వీణారవము మానినతరువాత దారియేమియుఁ దెలియక నిశ్చేష్టుఁడై నలుఁగడలఁ బరికించుచున్నాఁడు- నేనుబోయి కొనితెత్తునా?

కళా—చెలీ! ఆడుదానవుగావా! నీవుబోయినచో మనముగడుచుల కనగామా?

మనో—పాపము నాకుజాలివేయుచున్నది.

వసం—అయ్యో! ఆవీణారవముకూడ నదృశ్యమయ్యె! ఇదియేమిమాయయోగదా!

క. ఘనదుఃఖావిలమతినై
వనటఁబడునాకునీరవంబుముదంబుఁగ
బొనగూర్చిమాయమయ్యెఁగ
ఔనుచీకటిలోనమించుమించుంబోలెఁగ.

అన్నా! నేనెటుబోదును.

(అంతట కళావతి మరల వీణను బలికించుచున్నది)

వసం—(విని) ఓహో! ఈవీణారవము నాలకింపగా నన్నిటు రమ్మురమ్మని పిలిచెడు స్వనములు విననయ్యెడిని. ఈకలనాదము భూగ్నాశాభంగుఁడనైన నాకు మరల నాశకల్పించుచున్నది. చూడుము.

గీ. ఆశకల్పించిహరియించియంతలోనె
మగుడఁబుట్టించునీస్వరమహిమజేవి
తాశకల్పించిహరియించియంతలోనె

మగుడఁబుట్టించు నౌషధమహీమఁబోలు.

ఇఁక నీస్వరాశ్రయుఁడనై ముందునకుఁబోయి జన్మసాఫల్యము చేసికొనెద నుగాక.

కష్టములలోఁ గష్టములే దొంతరలుగా వచ్చునను టకు సాక్ష్యముగాఁ బలుగాకులగు శుకపికారావములతో మారుఁడుగూడ నన్నుఁజాల వేధించుచున్నాఁడు. నారాజపరాక్రమము నెఱపి వీనినిట సంహరింతమన్న ననంగుఁడయిపోయెఁగదా! కాకున్నను,

ఉ. తుంటరితుంటవిల్తుఁడెదఁ దూయఁగనేయు శరాగ్నినార్ప నా
బంటుతనంబుజాలునె యపాయకరంబగు పుష్పితావనీ
కంటకసీమ, రంగమయి గ్రాలఁగ ?, నైననుజాలునల్లతా
మంటపరాజితప్రసవమార్గణకాండసహాయమబ్బుచోన్.

కావున నీచంపకలతామధ్యమునసుండి చక్కనిపూఁదేనియ కాల్వ వెంబడిని సరణిగన్పడుచున్నది- ఇందుఁ బ్రవేశించెదనుగాక. (లతలు మెడకుఁ జుట్టుకొనఁ నూడఁదీయుచు)

గీ. ఆత్మబంధువులటులీలతాళులస్మ
దీయగళదేశమును బిరివేయునివిగొ
యాత్మబంధువుగాఁబోవునాలతాంగి
యిటులెపెనవేయుననుచుఁజెప్పుటకనంగ.

కళా—మాలతీ! కాంచనదీధితులఁబోలు తనదేహకాంతులు లతావినిర్మితతమోజాలములహరింప నిటుల నామోహనాకారుఁడు వచ్చుచున్నాఁడు. నేనింకొకసారి గానాదము మానుదునా?

మాల—సఖీ! నేనువలదనినచో నీవు మరియొకలాగున నుద్దేశింతువు.

మనో—చెలీ! వలదు. ఆతఁడు విన్నబోయి యున్నాఁడు.

మాల—(తొట్రుపాటుతో) ఇప్పుడెంతవరకు వచ్చియున్నాఁడు.

కళా—సఖీ! చంపకలతాగారమునుదాటి నీవతిప్రియముతోఁ బోషించెడు మాధవీ

లతానికుంజము నతిక్రమించి ముఖరాజీవమును మాటుజేసెడు కదళీపత్రముల నొత్తిగించుకొనుచు నచ్చటచ్చట నత్యాదరముతో వీణాగానము వినుచు నిటు వచ్చుచున్నాఁడు.

వసం—(ఆయాసముతో) ఇంతవరకుఁ గష్టపడి వచ్చితినిగదా!

ఉ. చందనపాటలీవకుళసారశిరీషలవంగలుంగమా
కందలతానికుంజములఁగ్రమ్మఱిస్వేదకణావళుల్ముఖా
ఖండిగజార్పసీశ్వరకృప౯ వెలికేగితినింకఁదల్లతా
సుందరమందిరంబెటులఁజొత్తునొ నాహృదిశాంతిఁబొందగ౯.

(నడుచుచున్నాఁడు)

మాల—నామొగమెత్తిచూచినఁ దృష్టిపథమునఁ బడునా?

మనో—చెట్లచాటుననుండి పరికించిచూచినచోఁ గనఁబడును. ఆకులమూలమునఁగాని దూరముచాలలేదు.

మాల—(మొగమెత్తిపరికించి) సఖులారా! నాజన్మమింకొకమాఱు సాఫల్యమైనది. నాదృష్టిపథమున నాతఁడువడెనుకాని యాతఁడునన్నుఁ జూచియుండఁడు.

కళా—ఇఁకమనము చేయునదియేమి.

మాల—(నవ్వుచు) చక్కనిపద్దెమొకటి పాడుము.

కళా—సఖీ! నీవే యాపనిచేయుము.

మాల—(సహర్షమై) నేనింతవరకు రాగము పాడితినిగదా! నేనుగూడ నీతోఁగలిసి పాడుచుందును.

—మంచిది- కొంచెము రాగాలాపనమాత్రము చేయుము.

మాల—సఖీ! నీవుపట్టినది వదలవే (అట్లు చేసివీణవాయించుచున్నది)

వసం—(వారికిఁ గనఁబడకుండ సమీపించి) అరుగో! నాజన్మసాఫల్యము చేయవచ్చిన జగన్మోహనాకారలగు దివ్యసుందరులు. అదిగో నాదివ్యధనమగు మాలతీకన్య. కళావతీమనోరమ లవుగో! (ఆనందముతో) ఏదియో పాడుటకుఁగాఁబోలు ప్రయత్నించుచున్నారు. మాలతీకన్యదగు రాగాలాపమెంతయు హృద్యమైనను

నామెబడు నాయాసముజూచి యిఁకఁబాడువారితోఁ గలియవద్దని చెప్ప నామనసు త్వరపెట్టుచున్నది. ఈలతలమాటుననుండి వినెదనుగాక. పాపమీమె యెంతయ లసెనో !

శా. రాగాలాపనతోనె శ్వాసములుదీర్ఘంబయ్యె ; వాఁడోడువీ
ణాగానంబున హస్తపద్మములుకందంజొచ్చె ; మోమెంతయున్
బాగుందప్పె ; వడంకఁబూనె శ్రమచేఁబాలిందులిట్లుండియీ
రాగాలాపిని పాడఁబోవఁగ విచారంబయ్యె నాయాత్మలోన్.

ఇదియునుగాక,

గీ. వల్లకీనాద యింపుగఁబాడుచుండ
శాశ్వతంబుగ వినఁదగుచవులుపుట్టె
సుమలతాతన్వి పడునట్టిశ్రమనుజూడఁ
బాటగీటయు నెదసరిపడదు నాకు.

కళా—సీ. తరుణేందుమండలస్ఫురణఁబాల్చినమోము వేడివెలుంగుచేవాడకున్నె !
మృదులశయ్యావనీపదకమలంబులు కర్కశోర్వీస్థలిఁగందకున్నె !
తారహారములనందఁగఁగందు లేఁజేయి కఱకురజ్జువులాగఁగమలకున్నె !
.:విమలాభరణధారణమునకుఁదగు మూపు కావడిచేఁగాయకాయకున్నె !
అమలకులజాత ! తరుణసుమాంగినేత !
అర్థిజనదాత ! శుభ్రవిఖ్యాతపూత !
ఏలనీకిది ; జేలవైయిట్లుపూన
నగునె యోచింపుమో వసంతాభిధాన ?

వసం—ఓహో ! వీరునాకెట్లు బోధచేయుచున్నారో !

మ. విదితామ్నానుగతప్రవర్తన కళావిజ్ఞానధౌరేయలీ
సదయల్ గాన ; మదీయవృత్తమును బూసంగుచ్చిన ట్లీకృతిన్
మదభృంగీకలనిస్వనోదిత సుధామాధుర్యముప్పొంగని
ముదితల్ బాడిరి నర్మగర్భితసమ్మోదానులాపంబులన్.

(కన్నీరుతో) ఇప్పుడుదీనికి దుఃఖింపందగదు- పురుషులకుం బౌరుషగుణము ప్రిధానముగదా ! అందులో క్షత్రియవంశజులకుం బ్రధానతమముగాన ధైర్యమువలం బించి వికసితముఖుండనై యుండెదనుగాక.

మాల—సఖీ ! ఆమహాపురుషుండెటనున్నాండో.

కళా—ఆహా ! ఏమినీతొందర- నీవొకయుక్తి చేసినచో నీనేత్రసన్నిధినుండి నీకు స్వర్గసుఖముగూడ నిచ్చును.

మాల—(సంభ్రిమముతో) అదియేమి ?

కళా—నీవు మూర్ఛనభినయింపుము- అంతలోమేము వసంతాయని పిలిచెదము- ఆ యత్తుండైయున్న యతండు త్వరలోవచ్చును.

మనో—బాగున్నది- చాలబాగున్నది.

మాల—(అట్లుచేయుచున్నది)

కళా—(భ్రిమించుచు) ఓవసంతకుమారా ! ఓవసంతా !

మనో—(సంభ్రిమముతో) రమ్ము ! ఓవసంతా ! వచ్చిరక్షింపుము.

వసం—(నవ్వికొనుచు) వీరునన్నుం జూచియుండరు-ఇవి వీరిలోవీరి హాస్యరసములు. నేను బయలుపడుటకుంగూడ నిదియే మంచియుపాయము- (గోచరుండై) సఖీమణులారా ! “వసంతకుమార” యని యత్యాదరముగా సంభ్రిమముతో నన్నుం బిల్చిన మీకేమి యీపూందోటనుండి కావలెను- నావలననేదైన లతకూన సంస్కరింపం బడవలసియున్నదా !

కళా—వసంతకుమార ! ఏదైన లతకూనయేమి- నీకుం గనంబడుటలేదా ! అదిగో మూర్ఛిల్లిన మాలతకూనను సంస్కరింపుము.

వసం—అన్నా ! ఆమెకుందగిన శైత్యోపచారము లేలంజేయరు.

కళా—రాజకుమారా ! నీరాకయే సర్వవిధ శైత్యోపచారములును- (మాలతినిసమీపించి) వసంతకుమారుండడుగో, చాలునిఁక లెమ్మని

(మాలతి తత్తరపడి లేచుచున్నది)

మాల—(సిగ్గుతో సంభ్రిమముతో చీరసవరించుకొనుచు) కళావతీ ! ఏమి యీనీవి

కారములు- చాలుఁజాలు. కొంచెముసిగ్గును మరియాదకూడ నీకు లేకపోయినం దుకు నాకు విచారముగానున్నది.

వసం—మాలతీతరుణీ! దాసుఁడనగు నాయెడల మీకుసిగ్గును మర్యాదలు ననవస రములు-

మాల—మనోరమా! నీకుఁదెలియదా! ఎవరో మహారాజకుమారునిఁబోలు సుందర పురుషుడు మనకేళికాభవనమునకు విచ్చేసినప్పుడతిథిసత్కారంబుల నెఱపవలె-

మనో—సఖీ! ఏమి తొందరపడెదవు- ఆయన వచ్చినదేది! నీవు లేచుటయేది!

వసం—మాలతీ! నారాకనీకెట్లు శైత్యోపచారము కావించెనో నీయాదరణమే నాకన్ని సత్కారములఁ గావించెననుకొమ్మ.

మనో—(ముందుకేగి) అపరమన్మధా! ఇక్షుధనస్సుబోలు కావడినటవైచి మా యాయతిథి సత్కారముల నందుము-

వసం—(విలాసముతగ్గి) అయ్యో! కావడియనఁగ జ్ఞాపకమువచ్చినది- ఇఁకజా మువొద్దునిండలేదు- నియమితకార్యమేమియుఁ గాలేదు-

(పోవుటకుఁ ద్వరసేయుచున్నాఁడు)

చ. మునివరునాజ్ఞ యింతతలపోయను ; బోయనునీరుతోటకే
ననునొకచింత వెన్కకును నర్కిలిమారనిశాతసాయకం
బనఁదగుకాంతతోఁబలుక నైతినిబోననువంతముందుకున్
జెనఁగొనిలాగ నామనము భీతిలియుయ్యెలవోలెనూగెడిన్.

కళా—మహాత్మా! నీకాముసింద్రునివలన నించుకయైన యాపదకలుగకుండ నీ యారామదేశమునకు యంత్రజలమును స్రవింపఁజేయుదము చూడుము-

(అట్లుచేయుటకై మనోరమాకళావతులు దూరముగాఁ బోవుచున్నారు)

వసం—(సవిస్మయుఁడై)

చ. అకలుషరామణీయకసుమాకరమందునమంత్రయంత్రభం
జికలనవాంగము ల్వెడలి చిత్రముగాస్రవియించునీరముల్
సకలమనోజ్ఞపుష్పకుజసంభరితంబయిముద్దులొల్కమా

ముకకుసుమావనింగలవె మాయలుమర్త్యములిట్టిచిత్రముల్ ?

ఇంక మానవవిశిష్టవస్తువుతో సంభాషణపూర్వక సుధారసము చవిచూచెదను గాక ; ఓతరుణీమణీ !

ఉ. సుందరపూర్ణిమావిధు విశోభితవక్త్ర ! యపూర్వదర్శనా
నందసుఖార్ణవంబున ఘనంబుగ మున్గుచునాదియందు నీ
కెందనరారునానుకులగోత్రములన్వివరింపుమంచు నో
చందనగంధికోరఁగదు జంకితిగా తెలుపంగనత్తరిన్.

మాల—(మిన్నకున్నది)

వసం—అదియునుగాక,

చ. లలనరో ! మామకామలకులంబు బలంబుఁజలంబువీడి నేఁ
డెలిపితిఁగా డెముందు ; భవదీయచరిత్రమొకింతయేని నీ
నులకునువిందుగొల్పుచు ననూనరసోదితలీలఁబల్కవే !
పలునుడులేల ? యెంతమగవారును జుల్కనసుమ్మిస్త్రీలకున్.

మాల—(ఇటునటు చూచుచున్నది)

వసం—సుందరీ ! ఎంతబిల్చినను మాట్లాడకున్నావు- ఇంకొకటి యడిగిచూచెదను. ఇందాక నీవు కర్ణామృతముగాఁబాడినరాగ విశేషమెద్దియో తెలిపెదవా ?

మాల—(చెలులవైపు జూచుచున్నది)

(కళావతీమనోరమలు మాలతిని జేరినతరువాత)

కళా—ఉ. ఇంతలుపీనులుండఁ జెలినేమనికోరెదరాకొమార ! య
భ్యంతరసీమవతిన్ లులతాంగి మిషన్నుడువంగఁజేయఁగాఁ
బంతమువట్టినాఁడవె ? యపారరసోదితగానసత్కళా
వంతుఁడవీవెరుంగనివె భాసురరాగవిలాససంపదల్ ?

మహాత్మా ! ఈయాసనమున విచ్చేయుఁడు-

వసం—(కూర్చుండి) మీరందఱు మీమీయాసనంబుల నలంకరింపుఁడు-.

కళావతీ ! రాగముమాట యేమైనను-

క. నెలఁబోలుమొగముబూఁదే
నెలఁబోలురసోక్తులెల్ల నెలనునురాతి
న్నెలపైయుండినయీబా
నెలతుకయెవ్వతెమొచెపుమనెచ్చెలి ! వేగన్.

కళా—(సిగ్గుతో) రాజకుమార ! మగవారుస్త్రీలకు చుల్కనగదా- కావున ముందు మేమందఱము వినునట్టుల భవదీయ నామధేయ నిర్మితపుణ్యాక్షరంబులు మా కర్ణపుటంబులఁ బడవేయఁగోరెదము.

వసం—(చిఱునవ్వుతో) ఈమె నిపుణురాలు- (ప్రకాశముగా) మీబాలామణికి నా కులగోత్రములు దెలియును- ఆమె నడుగకూడదా.

కళా—(సిగ్గుతో) కుమారా ! తప్పనిచోటులఁగాని పురుషనామములు స్త్రీలువచింతురా ?

వసం—సఖీ ! ఆతప్పనిచోటులెవ్వియో !

కళా—ముఖ్యముగాఁ గళ్యాణసమయమందు-

వసం—అట్టిమహోత్సవ మీమెకుఁ దీరెనా ?

కళా—(తనలో) ఈయన నిపుణుఁడు- (ప్రకాశముగా) ముందు మాయభిమత మీడేర్పుఁడు-

వసం—అట్లయినవినుము-

చ. వినుముమదీయవంశమతివిశ్రుతమైయరిమండలంబులన్
గినుకమెయిన్జయించుచు నకిల్బిషవృత్తిఁజతుస్సముద్రపా
వనమగువంగరాజ్యమును బాలనఁజేయుమహావనీశ్వరుం
డనఁబడురాజచంద్రుఁడ మహావిభవోజ్వలకీర్తిసాంద్రుఁడన్-

కళా—(ఆనందముతో) కంతుజయంతవసంతాదులఁబోలు మీనామపుణ్యాక్షరంబులిందెక్కడ ?

వసం—(సహర్షుఁడై) సఖీ !

క. కంతుఁడనంగుండౌటజ

యంతఁడుస్వర్గాధివాసియైయుంటనుభూ
కాంతలుజూచిరెవారివ
సంతునినొక్కరునిఁదక్కఁజక్షుఃప్రీతిన్-

కళా—(సహర్షబాష్పయై)(తనలో) ఎంతరసవంతముగాఁ దన నామనిధానము వెల్లడించెనో- (ప్రకాశముగా) కావునఁ దాముదర్శనీయులమగు వసంతకుమారులమని చెప్పవలా!

వసం—సఖీ! నీయూహ కడుఁజక్కనిది- ఇఁక మాయభీష్టము దీర్పఁడు-

కళా—కుమారా! వసంతాగమముచే సర్వలతావళులమాట యటుండినను మాలతీలతా వికసనమున కేమికొదువ- (మాలతిఁజూచుచున్నది)

మాల—సఖీ! చాలుఁజాలు- ఇఁకరావే! నాయనగారు శిక్షింతురు.

వసం—(మాలతిఁ గ్రేగంటఁజూచి) మీసఖీమణి మాలతీనామధేయముచే విరాజిల్లుచున్నదని చెప్పెదరా?

మాల—(వసంతునిఁజూచుచు) ఇఁకరావే! మనోరమా! నాయనగారు కోపింతురు.

(దూరమునఁ జిత్రకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చిత్ర—(తనలో) వసంతునిఁ జూచినప్పటినుండియు మాలతి మోహాతిరేకముచే స్త్రీయారామము వదలుటయేలేదు- ఇదినాకును పరమసంతోషము.

(నిష్క్రమించుచున్నాఁడు)

కళా—(తలనెత్తి) అదుగో! నాయనగారు మనలఁజూచుచున్నారు- ఇఁకరండు-

(ముగ్గురు నిష్క్రమించుచున్నారు)

వసం—అన్నా! నాకు ద్వితీయవిఘ్నము కల్పించి మరిపోయిరి-

క- ఉరుగజాగరవశంపా
సరణులుమిరుమిట్లుగొలిపిచనినట్టులనీ
కరియానలుమంజీర
స్వరయుతలైకన్నుబ్రామిసాగిరియకటా ?

నేను గార్యాంతరమునఁబోయిమరలవచ్చెదనుగాక- (నిష్క్రమించుచున్నాఁడు)

ప్రదేశము !! ఇంకొకయరణ్యవాటిక-

---

[మైరేయవిలంబులును వెనుక దుర్ముఖుఁడును బ్రవేశించుచున్నారు]

మైరే—(ఆడుచు) సీసా కాయపట్టుకొని.

గీ- కల్లుఁద్రాగినవాఁడె నాకమున కేగు
నితరజనములు నరకమందిమిడియుండు
చూడమే స్వర్గరాజ్యంబు సురలకగుట
బలముగలిగిన యసురులపాలు గామి (పీల్చుచున్నాఁడు)

దుర్ము—(ఆడుచు) క- హరునకు హరికిని గమలో
దరునకు నేయసురునకు నుపదమొందని యీ
నరుఁడు సుర ద్రాగుటను నీ
చరణాబ్జంబులకు నెఱగె నయిరింపగదే (మ్రొక్కుచున్నాఁడు)

మైరే—దుర్ముఖా ! నీయరణ్యవృత్తాంతమును మాకుఁ జెప్పుదునంటివి- కానిమ్ము-

దుర్ము—సామీ ! వినుము- ఇదివరకుఁ జెప్పినట్లు నన్ను మోసముచేసి యామాంత్రికుఁడీయాధిపత్యము వహించినాఁడు-

(అదృశ్యుఁడై సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుము—అది వట్టియబద్ధము-

దుర్ము—మైరేయా ! విలంబుఁడు నన్నబద్ధమాడెననుచున్నాఁడు-

మైరే—విలంబా ! నీవట్లాక్షేపింపకుము.

విలం—నేను మాట్లాడనే లేదు.

దుర్ము—అట్టి యీవనరాజ్యము మీకెట్లు చిక్కవచ్చుననన మధ్యాహ్నభుక్తియయిన తరువాత నాతఁడు నిద్రించును ఆసమయమునఁబోయి ముందు మంత్రగ్రంథములనపహరించి పిదప వానిప్రాణములు తీయవలయును.

మైరే—దారిజూపి నీవు సమయము చెప్పినచో నేను సిద్ధముగానుండును.

దుర్ము—అదిగాక యాతనికి మాలతియను చక్కనికన్యగలదు. దానిని సుఖముగా మీరు వివాహము కావచ్చును.

మైరే—(చిందులుత్రొక్కుచు) ఇంతకన్న నేమికావలెను, నడువుము.

సుము—ఇది నీకీరము గాదు. నీవాడునది పట్టికల్లి

దుర్ము—చూచితిరా! పల బుఁడేమనుచున్నాఁడో!

మైత్రే—(విలంబుని గ్రుద్దుచున్నాఁడు)(దుర్ముఖుఁడు చంకలు వైచికొనుచున్నాఁడు)
ఆమె నాకు మహారాణియగుగాక. ఇఁక ముందు నడుపుము.

దుర్ము—ఇది శ్లోకము (సంతోషముతో) గీ॥ చిత్తవృత్తికిఁ దీటు సువృత్తమొందు.
గల వెయ్యరయంగఁ గంచు కాగడల సైన

మైత్రే—(తన్నుఁ జూచికొనుచు) అందు రాజాధిరాజ చిత్తానువృత్తి
యిట్టిదంచు నను డువంగ నేరితరము॥

(సుముఖుఁడు దీని నే చదువుచున్నాఁడు)

మైత్రే—ఇది యేమి ప్రతిధ్వని దుర్ముఖా!

దుర్ము—ఇవి యిక్కడి చిత్రములు.

మైత్రే—దీని ననుసరించి పోదము గాక విలంబా! పాపము నిన్నుఁ గొట్టితి నని దుఃఖింపకుము. నీకు నా రాజ్యములో మంత్రిపదమి చ్చెదను.

(ముగ్గురు నిష్క్రమించుచున్నారు)

---

ప్రదేశము iii మఱియొక విపిన భాగము-

---

(చంద్రసేనుఁడు వీరసేనుఁడు వృషకేతుఁడు సుమంత్రి మైత్రేయుఁడును ప్రవేశించుచున్నారు.)

సుమం—రాజోత్తమా (చలికిలబడి)

చ॥ అతిసితిఁజాల నొక్కయడుగామడ యైకడు భారమయ్యె; మై
పులకలు గ్రమ్మి స్వేదజలపూరితమయ్యెను; వృద్ధునౌటచే
నలిగితి నీపథశ్రమల; నాలుక శోషిలె వాహావృత్తి; నా
కలిఘనమయ్యె; జీకటులు గన్నులఁ గ్రమ్మెను; గాళ్ళులాగెడిన్.

చంద్ర—సుమంత్రీ! కం॥ అతులబలయుతులమైతరు
ణతపోబలమగు మే మెయిట్లు నలుగుచునుండన్,
శతవృద్ధుఁడవగు నీబల
గతు లిఁక వివరింప నేల? కారుణ్యనిధీ!

అదియునుగాక మనసా! ఏలనీవిట్లు దురితిల్లెదవు.

చం॥ అరయఁగనేల? పుత్రుఁడయి నాసలువీడక యుండనేల? భీ
కరమృగసంకులంబగు నఖండతరంగకరాళదీర్ఘసా
గరమున జాఱు రత్నమును గన్గొన నేరితరంబు జూడ నీ
శ్వరుకృపచేతఁగాక మనసా! యిఁకఁబాఱఁగ నిరాశఁజెందుమా॥

వృష—(వీరసేనుని చెవిలో) చంద్రసేనుని మనోనిశ్చయము వింటివా! యిదివరకు మనప్రయత్నములు విఫలమయ్యెనని మాటనమున వెనుదీయకుమా.

వీర—(రహస్యముగా) అన్నా! నేనే వెనుదీయువాఁడనా!

వృష—(రహస్యముగా) పథశ్రమములై యున్న వీరల నీరాత్రి గడదేర్పవచ్చును.

వీర—(ఏకాంతమున) నేను గట్టాయిత్తమైయున్నాను.

(అంతనంతరిక్షమునఁ గొన్ని వికృతస్వరూపములు బొడగట్టి యదృశ్యులగుచుఁ బునరుపలక్షితులగుచు దివ్యగానవినోదము నెరపుచున్నారు).

చంద్ర—(ఊర్ధ్వనేత్రుఁడై) ఆహా! ఏమి! శ్రువ్యాధమైన నపనయించి హృదయరంజకములై తుంబురునారదులఁగూడ పరవశులుగ నొనర్చు నీగానవిద్యావిలాసములు.

సుమం—(సాశ్చర్యావలోకనుఁడై) రాజవర్యా! ఇది మాయాజనితాద్భుతముగాని నిజమెన్నటికిని గాదు. ఓహో! గంధర్వులేవచ్చి నృత్యము చేయుచున్నారా. డేమి!

చంద్ర—అన్నా! కాలవైపరీత్యములు.

మ॥ కలయో! నిక్కువమో మహావిభవమో కల్యాణమో శాంబరీ
కళయో రాక్షసమాయయో విమలసద్గాంధర్వసంగీతపే
శలశృంగారరసానుగుణ్యసుకథానందస్ఫమో యుల్లముల్
చలనంబొందెడి నీవికారములు సాక్షాత్కారమై యొప్పఁగన్॥

ఈస్థలవిశేషమేమియోగాని యొకసారి పరితపింపఁజేయుచు నింకొకసారి సంతోషింపఁజేయుచున్నది.

కం॥ ఉరుదుఃఖపరంపరయం
దరుదగుశుభమొందుగల్గ హర్షంబగు భీ
కరతమదుర్దినవర్షాం
తరమున బాలాతపంబు దనరించుగతిన్॥

వీర—(ఒడలు వడక) ఏమి యీమహాద్భుతస్వరూపములు.

వృష—(భయముతో) నాకమితాశ్చర్యభయావహముగానున్నది.

(అంతనంతరిక్షాటులందఱదృశ్యులైయుండ సుముఖుండు విచిత్రవేషముతోఁ గనఁబడుచున్నాఁడు).

సుము—(గురుధ్వనితో) సుమంత్రీ! మాగురువులకుఁ బరమోపకారివగు నీకు నా నమస్కారములు. ఓయి చంద్రసేనాది దుశ్చరితులారా! మీదుర్మార్గమే మిమ్మింతకుఁదెచ్చినది. మీరు నరకలోకనివాసార్హులరు (చంద్రసేనాదులు కత్తులనొరదీయుచున్నారు).

సుము—చూచితిరా! ఇంకను మీపాపబుద్ధి మిమ్ము వదలలేదు. మీనిశాతకృపాణములు మాశిరోజఖండములనైన నంటలేవు. మహాపాతకులారా! కర్మఫలమనుభవింపక తీఱునా! మీరొనరించిన పరమపాతకములలో నొక్కటి చెప్పెద. శ్రీకళింగదేశమహారాజాధిరాజు శాస్త్రమంత్రార్థరహస్యకోవిదుండును, శిష్టమిత్రుండును, దుష్టశత్రుండునగు చిత్రకేతుజనవరేణ్యుని, నాతని సోదరుఁడగు వృతకేతుహతకుని మాయోపాయములచే రాజ్యహీనునిజేసియాతని ముద్దుకూతుతోఁ బురము వెలిజేసితిరి, కావున దానికి నేఁడు తగిన శిక్షగాఁ గుమారరత్నమును గోలుపో ననుభవించితిరి మీకీపాపవిమోచనమునకు మార్గమొకటులన్న పశ్చాత్తాపమొక్కటియే. మీతో సంభాషించునంతమాత్రమున నాకు మహాపాతకములంటుచున్నవి. ఇఁకనేను బోయెద (అదృశ్యుఁడగుచున్నాఁడు)

సుమం—(హరిస్మరణతో) రాజా! ఏల యిట్లు ఢీలుపడియున్నారు. దైవమే మనకు గతి.

చంద్ర—సుమంత్రీ! దీనికిఁగారణమెల్ల నాటి మన పాపకృత్యముగదా! అన్నా! ఆ ఘోరకృత్యము కులాంతమునకుఁగారణమయ్యె. దుఃఖమధికతమమగుటచేత దుఃఖమనిపించుటయే లేదు. ఇఁకముందునకుఁబోదము (అనినిష్క్రమించుచున్నాఁడు)

వీర—(భయాకులుఁడై) వృషకేతూ! నీవు నావెనుక నుండుము.

వృష—కానున్నది కాకమానదు, ముందునడువుము (అనినిష్క్రమించుచున్నారు.)

సుమం—(తనలో) నేటికి వీరుముగ్గురు పశ్చాత్తాపములో మునిగియున్నారు.

గీ॥ వెనుకఁ జెట్టినయట్టి దుర్విషము చేత
నార్తుఁడై చాల దుఃఖించు నతఁడువోలె
నేను జింతింప నేల దుర్నీతిబుద్ధిఁ
బాము చేసిన పూర్వపాతకము కొరకు॥

దృఢకాయులు గనుక వారు ముందు వడిగాఁ బోవుచున్నారు.

సైం తే)—మహాపాతకముల దోషములు గ్రంథములలోఁ జెప్పినమాట నిశ్చయమే. నేను మీకూడనుందునురండి (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

గద్య. ఇది శ్రీమద్రమారమణీ రమణ చరణారవింద నిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్ర కవితాధురీణ పరస్పరానూనానురాగ సూరమాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప సుతగాన్వవాయాంభోధి సుధానిధాన వేంకటాచలాభిధాన ప్రణీతంబయిన మాలతీవసంత నామ నాటకంబునందు తృతీయాంకము.

---

# మాలతీవసంతము.

---

## చతుర్థాంకము.

రంగము—ఉద్యానవనప్రదేశము.

(వసంతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వసం—(తనలో) మహానుభావుఁడైన చిత్రకేతుమునివరేణ్యుఁడు నన్నుఁ గాంచిన ప్రథమ వేళావిశేషము చేత నేదియో యొకటిగా రంధ్రాన్వేషణపరాయణాయత్తచిత్తుండై యున్నవాఁడు; అయినను సజ్జనునికి లక్షణమేమన,

చ॥ పరులెవరైనఁదన్ను స్తుతిపాఠమొనర్చిన నుబ్బకుండఁ బా
మరమతిఁ దన్నుఁ దిట్ట నవమానముగా గణియింపకుండఁ దాఁ
బరులఁ బొగడ్త గాని నగుబాటును గాని యొనర్పకుండ ని
ర్ధరఁ జరియించు మానవుఁడె ధన్యుఁడు మాన్యుఁడు సద్వరేణ్యుఁడున్.

ఇంతకుఁ బరుఁ బొగడుట ననర్హమైనను స్త్రీరత్నమగు నామాలతీకన్య నెటులఁ బొగడకుందును? అన్నా! నేను చేయునది పొగడ్తయౌనా? కాదు. ఆమెకుఁ గల నైసర్గికశృంగారతనూవిలాసమును గుణనిధానమును నేను నిజముగా వర్ణింపఁ జాలను. స్వభావోక్తినైన వచింపలేని వక్త యతిశయోక్తి వర్ణింపఁగలుగునా?

ఉ॥ చక్కఁదనంబునన్ సుగుణసంపదలన్ వినయంబునందుఁ బెం
పెక్కిన సుందరాంగులను నెందరినో కనుఁగొంటిఁ గాని నే
నిక్కరణిన్ గుణాళియు నహీనసురూపము దాల్చెనో యనన్
జొక్కులతాంగి నొక్కరితఁ జూడఁగనోచఁగనైతి నింతకున్.

సృష్టికర్తయగు స్రష్ట విశిష్టవస్తువులనేరి యీమెనిట్లు సృష్టించియుండును.

గీ॥ నవ్యగుణమణిరజము శృంగారరసము
గలిపి మర్దించి లలితసుగంధమలయ
మారుతంబులఁ జొన్పి యీమానినినిగఁ
జేసెఁగాఁబోలుఁ బలుకులచేడెమగఁడు.

శృంగారరసప్రధానమైనను గన్యయగుటచే నతిముగ్ధమై యున్నది. ఏలనన:

సీ॥ తనవాలుచూపులల్లనిగిడ్చి చెలిమొగంబును మాటుజేసినన్గనఁగఁగోరు
జక్కవకవబోలి చక్కనై బటువగు పాలిండ్లపయ్యెదఁబదిలపరచు
సింగారపుంబలుక్కుచే మిన్నయయ్యును నిగ్గుచే మాటాడఁజేరవెరచుఁ
దనతండ్రివచ్చునోయనుసందియముకల్మిఁగొదములేడీయుఁబోలె బెదరిచూచు
గీ॥ చెలులజంకించులేతవెన్నెలలమించు; నవ్వులనునన్నురంజించునాదుపొలుపుఁ
గాంచిలోనెంచుఁ దమిమించుఁగలతఁగాంచు। మించుబోఁడిముగుదయూ
చుమించుకతన॥

నాకామెపైఁగల్గు మోహముకంటె దశాంతరములు నాపై నామెకే కలదని నిశ్చయింపవలసియున్నది. ఏమి యన

చం॥ తలిరులపాన్పుపైని ప్రమదంబఱి తానొకతీరుగల్గి నె
చ్చెలులసమాదరింపక విశేషవిచార పయోధిమగ్నయై
చెలినసుఁగూర్చి తూలికనుజేఁగొని చిత్తరువుల్ రచించెఁగొ
శలమున; నిందుమోహమును జాటవె? యీవనజాస్యవైఖరుల్॥

ఇది యెంతఫలోన్ముఖముగానున్న నామునిచంద్రుని యాజ్ఞ ప్రక్క బెదురుగ యున్నది. కాని యాతఁడును మునుపటివలెఁగాక కొంచెమనుకూలుఁడై యున్నట్టు ఉన్నది. ..: ఏలనన,

చం॥ కనఁడిటు నేనుసెచ్చెలులు గన్యకయున్ విహరింపఁజూచి; పొ
మ్మనఁడుసుతన్ వనాంతరలతాంగణసీమలవీడి; తొంటియ
ట్లనఁడు నెనున్ గఠోరనిశితాస్త్రసమానవచోదుధోరణుల్
మునివరుఁడున్ మదీయకృత పుణ్యఫలంబున శాంతుఁడయ్యెడిన్॥

ఇంతకు నన్నిటికి దైవమేయున్నాఁడు. వృథాయాలోచించినఫలమేమి. నేను నియమిత కార్యాంతరవర్తినై యుండెదనుగాక.

(చిత్రకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చిత్ర —(తనలో) చంద్రసేనాది వైరివర్గమునసర్గళసంక్షుభిత చిత్తులఁగాజేసి పశ్చాత్తాపాయత్తాత్ములుగ నొనర్చితిని. వారిమూలమునఁ బాపమీవసంత కుమారుని నీచవృత్తులఁజొన్పుచుంటిని. అదిగాక మాలతికి నాతనిపై మోహమతిరిక్తమై విరహార్తినేఁ గడుఁగుందుచున్నట్టున్నది. కావున వానిజనకాదిపరివారసమ

క్షణమున మాలతీ వసంతులకు వివాహ మహోత్సవ మొనరించి సర్వజనాహ్లాదక రమొనరింతును గాక. ఇట్టి కార్యములయందు యోచింపవలయు నదియేమన వధూవరులకు గాఢానురాగమున్నచో నిఁక నాతనిగుణములఁ జూడవలెను. ఎట్లన,

ఉ॥ నమ్మకమైనవాఁడు బుధనందనుఁ డార్యసుతుండు సద్గుణౌ
ఘమ్ములకాటపట్టు సువికాసమనోహరమూర్తి, పూర్ణభో
గమ్ములసొమ్ము చిన్నయు నఖండకళావిదుఁడైన యట్టివాఁ
డిమ్మహినున్నయాతనికి నీఁదగుఁగాదె కుమారికామణిన్.

ఇవి యన్నియు నీతనియందుఁ బట్టుయేగాక,

చం॥ నరుఁడుపరాక్రమంబున ననంతతనూసుకుమారసంపదన్
మరుఁ డప్రకీర్తనీయబుధమాన్యవనీపకరాజిరాడ్వరం
కరుఁడు నిజానుకూలపరికల్పితదాసగణప్రమోదకం
కరుఁడు సదన్నవాయవృధుకంధిసుధాకరుఁడీనకుండిలన్.

కావున వసంతునకును మాలతికిని వివాహమన్యోన్యశోభాకరంబగు. ఇది దైవప్రీతిగాను జనసమ్మతముగానుండును. వీనినిఁక నీచవృత్తి మాన్పించి వారిద్దఱకుఁ గొంత పరిచయముచేసి సంతోషమాపాదింతునుగాక.

(వసంతునిఁ గొంచెము సమీపించి)

ఉ॥ రారకుమార! రాగగుణరత్ననిధీ! సుకుమార! రార! నీ
కేర! వనస్థలిన్ జలములీక్రియ మోయఁగనేల? చాలునో
రోరి! ననున్ వినంగదర! యుంటినిచ్చట! దివ్యసుందరా
కార! వసంతనీకు సహకారముగూర్చెదఁ బెండ్లిఁజేసెదన్.

వసం—(తలయెత్తి) నాప్రియజనకుఁడు చంద్రసేనుడువచ్చెనా! ఆహా! ఏమి నాయదృష్టము. ఇఁక నాచిక్కులు వీడినవి.

గీ॥ తండ్రి! యెట్లుంటివీవు నీతనయువిడిచి
వచ్చెదను నన్నుఁ గౌగిలిగ్రుచ్చుకొనుము
యెవ్వరోగాని యొక్కఁడునీంద్రచంద్రుఁ
డాజ్ఞదయచేసె జలము మోయంగనాకు॥

(చిత్రకేతునిగాంచి) అన్నా! నిర్భాగ్యులకంతయదృష్టము పట్టునా? కీడులో

గీడుగాని మీ కెన్నటికిఁ జేకూరదు (భయపడి) చిత్రకేతుఁడైనను జనకప్రేమ తో నన్నాదరించి పిలిచి పెండ్లిచేసెదనని చెప్పుటచే నీగడియనుండి కొంచెము నా గ్రహచారచక్రము శుభస్థితిలోనికి మగుడినట్లు పొడగట్టుచున్నది. గనుక నాతని సమీపించెదను గాక. (పోవుచున్నాఁడు.)

చిత్ర—(చేరఁదీసి) వసంత ! నాయనా ! మీనాయన వచ్చెననుకొంటివా ! పాపము. ఇటుకూర్చుండుము నీమీద నాకు నిండుప్రేమగలిగినను నిన్నింత నీచకృత్యావ లంబునిగ నేలచేసితినన,

గీ॥ అన్యగుణశోధన మొనర్చునంతవరకుఁ
గఠినభావంబుఁబూనుట క్రమము సుమ్మి
స్వర్ణమునుగూడ వహ్నిలజాడఁదెలియ
గీటురాతిఁగోరాచుండు గీయకున్నె ?

వసం—తండ్రీ ! భావిసుఖము నీరీక్షించు పురుషులు ప్రస్తుతదుఃఖముల సరకుగొనరు.

చిత్ర—కుమారా ! నాపరీక్షలకన్నిటికి నిలిచితివి. నిన్నిఁక నాయాన పెట్టి ననేవసరో ము కావున నీవీనీచకృత్యముల వర్జించి స్వేచ్ఛావిహారివై యుండుము. ఇదియు నుగాక,

చం॥ పరునలయుఱఁపనట్టి పరిపక్వఫలంబొరయఁదాకనట్టి సు
స్మరనిశితాస్త్రమన్యజయశాలుని వ్రేలిఁదొలంగుముద్దుటుం
గరమలిఁజేరనీని నవకంజమునై తనరారు యామినీ
వరముఖినిచ్చినీకు సువివాహమొనర్చెద దైవసాక్షిగన్॥

శ్లోకమువినుము. గీ॥ కావ్యనాటకలనదలంకారపేటి
గానసంపత్కళావాసఖనితలంబు
వైనయస్మత్కుమారి నీకబ్బె నేనిఁ
బూవుఁదావియుఁగూడిన పొలుపుగాంచు॥

అన్నిటికిని ముఖ్యమగు నొక కఠినాజ్ఞ నీకుఁజేయవలసియున్నది.

గీ॥ బ్రహ్మముడివేసఁబడుదాక బాలముడులు
విప్పకువసంత ! నీవవివేకబుద్ధి
విప్పితేని భవద్వంశవృద్ధికదియఁ

జేవకర్త్రుకుఁ జెడవోలెఁ జేటొనర్చు ॥

వసం—పితృసమానా! మీమాటకు నేజవదాటుదునా! మీశాపోక్తికిఁ దోడుగా నాప్రమాణవచనంబుల నాలకింపుఁడు.

ఉ॥ సుందరనందనాళి మదిశోభిలఁగోరితినేని సంతతా
నందముతోడ జీవితదినంబులు సాగఁగనెంతునేని మీ
నందనినైన నిందుతమి నామదిలోఁగొనునేని నమ్ముఁడీ!
యిందుముఖిన్ స్పృశింపనని యెన్నటికిన్, భవదాజ్ఞ లేనిచోన్॥

ఇదియునుగాక-

చం॥ ఇనగతిమందమౌటను మునీశ! ముహూర్తము సాగకుండినన్
దనబలగంబుదోడువడ దర్పకుఁడస్త్రశతంబులేసినన్
దనువును వీడవచ్చిన ధృతవ్రతినౌదునుగాని ముట్ట మీ
తనయను, బెండ్లిసద్విధివిధానముగా నొనరించునంతకున్॥

చిత్ర—వసంతా! నీమాటలమృతపుఁదేటలుగానున్నవి- కావున,

ఉ॥ ఆటలఁబాటలంగలిసి యాడుమిపాడుమి బాలతోడ; లీ
లాటనవృత్తి నవ్యకుసుమాకరసీమలఁ జిత్రచిత్రశ్యం
గాటకభూములన్ విహరణల్ పచరింపుమి; లోనఁగల్గునా
రాటము వీడుమీ; సుఖతరంబగుఁ గార్యములింకమీదటన్॥

(మాలతి ప్రవేశించుచున్నది)

మాల—(తనలో) నాయనగారు కొంచెము సేపు తాళి నన్నిటకు రమ్మనిరిగదా! ఆయనను బోయి కలిసికొందును (ఎదురుచూచి) అదుగో! నాయనగారు నామనోధనహారుఁడగు వసంతకుమారునితో నేమిరో వికసితవదనారవిందులై మాటలాడుచున్నారు- ఇపుడు నాభాగ్యము పండినట్టులున్నది- (ముందుకుఁబోయి) పితా! నమస్కారము- (మ్రొక్కుచున్నది)

చిత్ర—కుమారీ! నీకుఁగల్యాణమగుఁగాక (చేరఁదీసి) వసంతకుమారా! ఇదిగో నా పుణ్యధనము- దాచిదాచి ఋణప్రదాతకు నర్పించుధనమువలెనిన్నాళ్లుబెంచి నేనీబాల నీపాలుచేయుచున్నాఁడ- నేనుఁజెప్పిన ప్రమాణబద్ధుఁడవై యీక్రీడోద్యానలతాంతరములయందు మాలతీకన్యతోఁ బ్రొద్దుపుచ్చవచ్చును- ఇంక మీరు

బొందు-

వసం—తండ్రీ! మీయాజ్ఞాప్రకారము సర్వవిధములబద్ధుఁడనే!

చిత్ర—మాలతీ! వసంతకుమారునితో నేటినుండి కలిసియాడుకొమ్మః.

మాల—చిత్తము దేవరవారి యాజ్ఞాబద్ధురాలనే గదా-

చిత్ర—ఇఁకమీరు బొందు-

మాల—చిత్తము

వసం—చిత్తము (నిష్క్రమించుచున్నారు)

చిత్ర—సుగుణాకరుఁడైన వసంతకుమారునికిఁ బుత్రికారత్నము నొప్పగించి కొంతభారము పోఁగొట్టుకొంటినిగదా! ఇఁకనాప్రాణవాయువుల హరింపఁదలచిన యాదుర్ముఖపన్నగమును శిక్షించుపని యగత్యమైయున్నది సుముఖా! ప్రియశిష్యా! ఇటురమ్ము

సుము—(ప్రవేశించి) స్వామీ! హాసాద్.

చిత్ర—దుర్ముఖుండిదివరకు మనకొనరించిన యపకృతులకుదేనికిఁ దగినశిక్షవానికిఁ గావింపలేదనుట యెరుగుదువా?

సుము—తండ్రీ! యెరుగకేమి. వాఁడపకృతులుజేయఁగా మనముపకృతులుజేయుచున్నాము.

చం॥ ఖలులెప్రడైన సజ్జనులగాసిమొనర్చినవారలోర్చిన
త్ఫలములాసంగుచుండ్రుమరిబాధలఁబొందుచునున్న; వాడినా
గలిగొనిదున్నిపెంటలనుగప్పిన, భూనతియోర్చిపంటలన్
గలుఁగఁగఁజేయదే? మరలఁగర్షకులార్తియొనర్చుచుండినన్॥

చిత్ర—శిష్యా! నీవాక్యములు కడుశ్లాఘనీయములు. ఆదుర్మార్గునివానియనుచరులనెచటఁజూచితివి-

సుము—గురుచంద్రా! వినుము.

సీ॥—అతిసురాపాన మత్తాయత్తదేహులై క్రిందుమీదెరుగక కీలుబొమ్మ
లట్టులల్లాడుచు నాడుచుఁబాడుచుఁదూలుచు సోలుచు దుండగమున
మిమ్ముఁజంపెడుబుద్ధి మీయాశ్రమముజేరు వారలనాగాన పరిచయమునఁ
బరవశాత్ములఁజేసి యెరుమార్గమునఁబెట్టి యంధారవంబుల నాలకించి

గీ॥ కూడవెనువెంటఁబారెడుదూడలట్లు । రాఁగవారలసకలదుర్గంధనిలయ
కంటకావృతమైనయగాధకూప । మందుఁడించితిఁదగునట్టిమందటంచు॥

చిత్ర—సుముఖా! మేలుపనిచేసితివి. గానమందెంతయైనశక్తి కలదు.

గీ॥ గానవిద్యోరుమంత్రసంధానమునకు
వశులుగానట్టివారుప్రపంచమందుఁ
గలరె? యశ్వాదిపశుగణములునుగూడ
దీనినాలింపమేతలమానుననఁగ॥

కావునఁబ్రస్తుతమువారికిఁ గొంతశిక్షయైనది. చంద్రసేనాపుత్త్రుఁ గొనితెచ్చు ప్రయత్నమునకై పనిజరుపవలెను. అదిగో సూర్యాస్తమయమగుటచేఁబక్షులు కలకలనాదంబులతోఁ బరుగులువారుచున్నవి.

చం॥ కరముపకారియైన యధికారిజనంగఁదపించుసద్భటో
త్కరమునుబోలెఁజాలఁ బరితాపమునొంధివిహంగమంబులే
డ్తెఱమొఱపెట్టిపెట్టియతిదీనతఁ జేరుఁగులాయముల్ దివా
కరుఁడపరాబ్ధిఁగ్రుంగఁ దమకన్నులమాటగుడాకఁగాంచుచున్॥

సుము—గురువరా! అవును, మింటికైచూడుఁడు. సంజకెంజాయలన్నియెడలవిస్తరించి గగనభామినికి నూత్నవికాసదాయకములయ్యెను.

ఉ॥ అంబరభూమిఁగాలరజకాగ్రణిశుభ్రసువర్ణశోణనీ
లాంబరరాజినెల్లెడల నారఁగఁగట్టెనొ నాఁగసర్వవ
ర్ణంబులుసాంధ్యభాగమున రాజిలుఁగంటెమునీశ! మారుతా
డంబరపాటవోద్ధతనటత్పటజాలవిలాసవైఖరిన్॥

చిత్ర—ఇఁక మనము కాలోచితకృత్యములకై పోవలెను- ముందునడువుము.

సుము—చిత్తము (నిష్క్రమించుచున్నారు)

---

ప్రదేశము ii ఉద్యానవనము.

---

[మాలతీవసంతులిరుపార్శ్వములనుండి ప్రవేశించుచున్నారు]

వసం—సఖీ! మాలతీ! నావైపుచూడుము.

మాల—(నమ్రవదనయై యూరకున్నది)

వసం—చెలీ! నా మొగమువంకఁ జూచుటకు నీకుఁ దీరనియెడల సర్వజనాహ్లాదకరంబుగ నుదయించుచున్న యీ బాలచంద్రునైనఁ జూడుము.

ఉ॥ నీలవినిర్మలాంబువులు నెక్కొనఁ జక్కఁగ మధ్య, దీర్ఘక
ల్లోలవిరాజితాబ్ధి నతిలోలత నూగెడు పద్మముంబలెన్
గ్రాలెడుఁ జంద్రుఁడంబరమునన్ జలదంబులు ఫేనఁ బర్వఁగన్
లోలతఁ గాముకాంచితసులోచన కైరవముల్ దలిర్పఁగన్॥

మాల—(తడఁబడుచు మొగమెత్తి) వసంతకుమారా! కాముకీకాముక జనముల కాంతిఁ దెచ్చు నా గురుద్రోహియగు చంద్రునిఁ జూచుటేల? మీరు చెప్పినట్లు సర్వజనాహ్లాదకరంబుగ రేఁబగళ్ళుగూడ వికసించియుండు మీ ముఖచంద్రునే నేను జూచుచుందును

వసం—సఖీ! నీవాక్యము లతిమధురములు. అట్టి నీచేఁ బోషింపఁబడుటచేతనే యీ యారామప్రదేశ మనంతశోభచే విరాజిల్లుచున్నది.

మాల—అపరమన్మథా! నేనెంత శ్రద్ధతోఁ బోషించినను కట్టకడకు సంస్కరణపరాయణులైన తమ హస్తపద్మములు తాకుటచే సుమీ దీనికి పూర్ణశోభ వచ్చెను.

వసం—మాలతీ! అది సరికాదు- అనల్పశోభాకరమైన నీ నవాంగ శృంగారవనమునకు స్వీరనపోషణ తప్ప యన్యసంస్కరణ లాభమేమి గలిగెను- నిన్నుఁ గాంచినప్పటినుండియు నాకీ శృంగారవనముపై నాశయే లేదు.

మాల—(నవ్వుచు) ఏల నా స్వరూపము శృంగారవనమును మించెనో?

వసం—మ॥ తరుణాంభోజచయంబు చంపకముకేదంగుల్ మధువ్రాతత
త్పరరోలంబములున్ లతావళులు భాస్వత్సూనసంఘాతముల్
సురపొన్నల్ మధుకుల్యలున్ గదళికల్ పూగుత్తులుంగల్గునీ
వరశుభ్రాంగవనంబుకంటె నరుడే వామాక్షి! నాకీవనుల్॥

మాల—(దరహసితవదనయై) సమస్తకళావిశారదులైన తమకు సదుత్తర మీయంశమున నీయఁజాలను.

వసం—సఖీ! సిగ్గువీడినకొలఁది నీకళావిశేషములను నీవును జూపింతువు- అంతవఱకు మఱియు భయాంధకారావహంబులగు నీమందహాసములు నాకనంతమోదావహంబులు- అట్టి నీలేతనవ్వులు నీముఖచంద్రమండలమునఁ బొడగట్టినపుడెట్లుండునన,

చ॥ ఎలమిగులాబిపుష్పముల నెంతయుబారుగఁ గూర్పదానిపైఁ
జిలికెడు మంచుబిందువులఁ జెల్వగుచంద్రికరంబులట్లనో
నలినదళాక్షి! నీదు-చిరునవ్వదలిర్చెడు ; బిందుసంతతిన్
దలఁపునఁబెట్టు దంతరుచి ; తప్పకయోష్ఠము లేఁటుఁ బూవులన్॥

కమల—(సాహసముతో) అట్టి చంద్రికరమిళితమైన గులాబిపుష్పము తగిన హస్తమునఁ బడిన గంధాఘ్రాణశోభవహించుట

వసం—(గ్రహించి) సఖీ ! కం॥ పరిమళమిళితంబు మనో
హరమును నేత్రోత్సవంబునైన గులాబిన్
సరసుఁడు గ్రహింపనెంచక
ధరఁబో అగునె మొఱకునకును దరుణీ! చెపుమా!

కమల—(నవ్వుచు) అట్టిసరసుఁడా సుమరాజమును జూడకముందే యొక మూర్ఖుఁడు గ్రహింపవలసి వచ్చినచో దానియవస్థ యెట్లుండును.

వసం—(మందహాసముతో) సఖీ! వినుము.

చ॥ చెవిటికివీణెపాట వనసీమకుఁజంద్రిక మూఁగవానికిన్
గవివరుగ్రంథమంధునకు గైరవమిత్రుని దర్శనంబు సొం
పవునెలతాఁగి! యట్టులెగదా తగుభర్తకు నీయకుండినన్
బ్రవిమలగాత్రిహావరసభావములందము వమ్మగుసమ్మిలన్॥

కమల—(చిఱునవ్వుతో) నేనన్యాపదేశముగా ప్రశ్నించినదానికి సదుత్తరమిచ్చి నన్ననుగ్రహించితిరి. నాథా ! ఇంతవరకు నన్నేయుద్దేశముతోఁ బరికించుచుంటిరో.

వసం—(తనలో) గీ॥ లజ్జచేమాఱువలుకని లలనయిపుడు
సరససంభాషణముల నుత్సవము సలుపు
వేసవిఃకాలమందలి తేనెమంచు
విరియఁగన్పండు వానఁగెడు వృక్షమట్లు॥

చెలియా !

ఉ॥ దైవము నానొకండనుచుఁ దథ్యముగాఁ దలపోసి రేఁబగల్
కేవలభక్తియుక్తి మెయిఁ గొల్చు పతివ్రతైకపూర్ణపా
పాపహమార్గసూచనిగ నన్యములన్విడనాడుభక్తున

ట్లో వనజాక్షి! నేనితరమొల్లను నీపయిఁగూమిఁ జేమిఁ జేఁ॥

మాల—(సహర్షయై) అశ్రమోపాంతముల యందుండుటచేఁ గాఁబోలు దేవరకు భక్తిరసోపమలు స్ఫురించుచున్నవి- అట్టిమీకు నేనెట్టు లుంటిని?

వసం—సఖీ! ఆశ్రమోపాంతములననేల? నీవెప్పుడు నాకు మంత్రదేవతవేగదా! ఆట్టినాకు నీవెట్టులుంటివన,

చ॥ అమలతపోనిధానుఁడగు నాతనికొక్కనికే నిజస్వరూ
పముగనఁజేసి యన్యులగువారిభ్రమఁ బఱఁదోసియొప్పున
య్యమలునిఁబోలె నోసతి! యథార్థపు మానసపూజఁజేయునా
సుమహితయోగసంపదను శోభిలుదీవు మదీయసన్నిధిఁ॥

మాల—(పక్కన నవ్వుచు) అట్టినిశ్చలభక్తున కేమివరములు వరణీయమో!

వసం—సఖీ! వినుము. గీ॥ చంద్రలోకంబునందు సంచారమొకటి,
శాశ్వతామృతపానంబు సఖియ! రెండు,
చందనాకీర్ణభూధరశయ్య మూఁడు,
అమితసుఖమోక్షలక్ష్మి నాల్గవదినాకు॥

మాల—(సహర్షబాష్పయై) (తనలో) ఆయనకు నేనేమియు బదులువలుకఁజాలను. (ప్రకాశముగా) వరణీయా! స్వల్పకాలములోనే సఫలీకృతమనోరథుఁడవయ్యెదవుగాక.

వసం—(స్పృశింపఁబోయి) అన్నా! మరచితిని. సమయాతిక్రమణము తగదు-

గీ॥ సరసపరమాన్నభక్ష్యసంభరితహేమ
పాత్రముండిడి తినకుమీ యాత్రపడుచు
నంచుభోక్తకుఁదెల్ప నాయానమెంత
గల్గునోవానికట్టులే గల్గెనాకు॥

ఈమాత్రత్వమంతయు నామన్మథభగవానునిది- ఇతఁడుధన్యీ! నీవెంతటి వాఁడవైననగుదువు.

చ॥ ప్రతినలుపూజ్యముల్; వరుసవాఖులుసున్న; హుళిక్కిమానసో
ద్గతపృథులాగ్రహంబులు; విదారణదారుణమండలాగ్రబా
ధములయినన్ బ్రియత్నములఁదెంపున మాన్పగనీవు; నీడుపో

ధృతవరశాసనంబులను దాటఁద్రినేత్రునకైన శక్యమే ! ॥

అయిన నీలో నేమియున్నది. కాముకుల యవస్థలలోనున్నది గాని. ఇత్యుక్త్వ!

గీ॥ మృదుసుమములీవు విరహులమీద నేయ
బాణవర్షంబుబోలెఁ గన్పడుచునుండు
విరహవారధి నీదినవెనుక నవియె
చందనముబోలి చల్లనై సౌఖ్యమొసఁగు॥

మాల—(నవ్వుచు) మారుఁడెంత క్రూరుఁడైనను వసంతుఁడైన కొంత సంతసింపఁజే
సిన బాగుండును గదా !

వసం—సఖీ ! నిన్ను వసంతుఁడెన్నటికిని ననాదరణజేయఁడు.

ఉ॥ వీడిన కేశబంధమును వెండియుఁగూర్చియలంకరింతునో !
వాడినపాదపద్మములవశ్యము లూరువులందుఁజేర్చి మో
మోడకపట్టువాఁడనో ! నవోల్లసితాంబుజపత్రపాళిఁబూ
బోడిరొ ! వీచువాఁడనో ! నమున్నతిఁదెల్పు విసంగఁగోరెదన్॥

మాల—మదీయార్హకృత్యములగునట్టివానినిఁ బూజ్యులచేఁ జేయించి దోషము ఘోరిం
పఁజాల.

వసం—సఖీ ! క॥ దాసునిరొండఁబనిగొనుటలు
దోసంబని యెంచనేల ! తొయ్యలి నాకో
యానంబుగాక హర్షా
వాసంబులు నీకొనర్చుపనులెన్నయినన్॥

మాల—నాథా ! ఈయుద్యానవనమధ్యమునకుఁ బోయి యచట నాచేఁబెంపఁబ
డు లతావళులును బుష్పవిశేషములును దర్శించి యానందింతము వచ్చెదరా !

వసం—సఖీ ! క॥ వనమైన యుపవనంబగు
వనజానన ! నిన్నుఁగలిసి వసియించుటచేఁ
వనమగు నుపవనమైనను
వనజాక్షిరొ ! నీవులేని పట్టున నాకున్॥

అట్టి నాకు సౌందర్యరాశియగు నీవును బ్రియదావనంబును గూడఁ దటస్థించినచో

నిఁక నాభాగ్యము వేరెయడుగనేల ?

(మాలతి వనమధ్యమునకుఁజొచ్చి పూవులను ద్రుంచి బంతి కట్టుచున్నది)

వసం—ఓహో ! ఏమి యీమలయమారుతము.

గీ॥ సకలపుష్పసుగంధవాహకతనొప్పి । నీటిపైఁ దెమ్మెరలఁదెచ్చి నేఁడుసుఖము
బడయఁదయఁజేసె మన్మథబాధితాంగ। కములకెంతయుఁబవనుండుకలికిమిన్న.

మాల—(నవ్వుచు) దేవరవారి హస్తపద్మముల నీపూలచెండు కరంబలంకరించు గాక.

వసం—(నవ్వుచు) సఖీ ! నీపూలచెండ్లు కరంబులఁ గరంబలంకరించుటకేగదా నేను గోరుచుండునది. (అందుకొని వాసనజూచుచు)

క॥ వాసనలఁ గలిసి చెలువగు । నీసుమకందుకము దేనికైనయానాయటం
చాసమెయి నడుగఁగోరితి । ఓసఖి! కాకున్న, నెందుకొసఁగెదు నాకున్॥

మాల—(ప్రముదితయై) నాథా ! మీయుక్తులకుఁ బ్రతివచనమిచ్చు పాటిదానను గాను. (మరికొన్ని పూవులఁగోసి వేణికి ముడుచుకొనుచున్నది)

వసం—మాలతీ ! గీ॥ సహజసౌందర్యమహిమనాశనము గాఁగఁ
గనకమయభూషణంబులఁ గాంతవలచుఁ
బ్రకృతిఁ బ్రకృతిని గలియుచోఁ బరమశోభఁ
బొందు భవదీయవేణిపైఁ బూలుబోలె॥

మాల—నాథా ! చూచితిరా ! ఈరంభాపత్రమాతపసీశాఖపై నారగియుండ దానిపొడుగునను నల్లని ద్రాచెట్లు పండికొనియున్నదో ! దానికర్పూరరజోపరిమళమునకై వలచివచ్చినది సుడీ.

వసం—(సవిస్మయుఁడై) ఓహో ! ఎంత మనోహరముగానున్నది.

గీ॥ కనకకదళీదళంబుమధ్యమువసించి । నీలసర్పంబు శోభచే నెగడుచుండె
హేమకాంతుల తళ్కువహించుచేడు। వెన్నుపొడుగునఁ దనరారువేణివోలె.

మాల—(నవ్వుచు) మృదులతరమగు నీమాలతీలతను సోదరీన్యాయముగా నేను బోషించుచుందును.

వసం—సఖీ ! కం॥ మృదులతరకోమలంబగు। సదమలలతికాభఁజూచిజనకుడునీకున్
మదవతి! మాలతిపేరును। నిదితంబుగనిచ్చెఁదగినవెలదివటంచున్.

మాల—నాథా! అట్టి నామమునకు నేనర్హనైనయెడ మీరు వసంతాభిధేయమునకు దశాంతరములు తగియుందురు (ముందునకు నడచుచు) ఈమావిగున్న యెంత కన్నులపండువుగా నున్నదో!

వసం—సఖీ! స్థాణువైన యీవృక్షమునందాధిక్య మేమిగలదు.

క॥ పల్లవరాగంబుల, ఖగ। తల్లజసంస్తుతుల, సౌఖ్యదాయకముల, ది ।
వ్యోల్లసితవాసనలనీ । వల్లదె! యెలమావిబోలియలరెడుతరుణీ! ॥

మాల—(నవ్వుచు) నేనాడువాక్యములకెల్ల రసపోషణచేసి నన్నానందాబ్ధిలో నోలార్చు దేవరకు నేనుత్తరమీయలేకున్నను నాకుఁబరమసంతోషమే. (ఇంక ముందునకుఁబోయి) ఇది మానాయనగారికి పూజాద్రవ్యముల సమకూర్చు పుష్పవాటిక; వారు దీనిని నన్నుఁ బ్రేమించినట్లు ప్రేమింతురు.

వసం—(సహర్షుఁడై) నాకును విధాత ప్రత్యేకించి కొన్ని పూజ్యవస్తువులేర్పరచెను.

ఉ॥ గోరులనైన మోపుటకుఁ గొంచెమెడంబును లేని చన్గవల్
జేరలనైనఁ గొల్చుటకుఁ జక్కనిచక్కని వాలుకన్గవల్
బారలకైన లొంగని యపారవిలాసితకేశబంధముల్
సారసనేత్రి! నాకొఱకు సృష్టవిధించిన పూజ్యవస్తువుల్॥

(అంతట పక్షులు కలకలనాదములు జేయుచున్నవి)

వసం—సఖీ! నేనుచెప్పినవి యన్నియు నిజమని పక్షులు ఘోషించుచున్నవి.

మాల—సఖా! అట్లుగాదు. తెల్లవారినట్టులున్నది.

వసం—(పరికించి) అవును- నిజమే! అన్నా! క్షణములో రాత్రిగడచెనే?

గీ॥ క్షణముదివసంబుబోలిక జరగెవెనుక । క్షణముబోలిక దివసంబు జరగునిపుడు
కాంత! మున్నటియట్లనే గడచెనేని । పూర్ణహర్షాబ్ధిలోఁ దేలఁబోలుమనకు॥

(అంతట కళావతి ప్రవేశించుచున్నది)

కళా—సఖీ! మాలతీ! పూజాద్రవ్యములను బట్టికొని నాయనగారు నిన్ను వేగరమ్మని సెలవిచ్చినారు.

మాల—అట్లయిన మనమిరువురమిటుబోదము రమ్ము.

కళా—మంచిది. వసంతకుమారా! మిమ్ము నాయనగారాశ్రమోపాంతకేళీకావన

మునునుండుమని సెలవిచ్చినారు. (నిష్క్రమించుచున్నారు)

వసం — తదాజ్ఞాప్రకారము నేనును బోవుచున్నాను. (నిష్క్రమించుచున్నాఁడు)

గద్య. ఇది శ్రీమద్వ్రజరమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానూనానురాగసూరమాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప తురగాన్వయాంభోధిసుధానిధాన వేంకటాచలాభిధానప్రణీతంబయిన మాలతీవసంతనామనాటకంబునందు

చతుర్థాంకము.

శ్రీ

# మాలతీవసంతము.

## పంచమాంకము.

రంగము. చిత్రకేతుని యాశ్రమము.

చిత్ర—ఉ॥ కోరినకోర్కు లెల్ల నమకూరెడి శిష్యగణంబులిష్టసం
చారము చేయుచున్కిని ; విచారములోననడంగె ; నాదుగో
చారము నంత్రతాభ్యుదయసంగతమై శుభదాయకంబుగా
మాకెఱఁగమూరికర్త సుకుమారుఁడు భర్తగనబ్బె మార్గతన్॥

ఇంతకు మనప్రయత్నములలోఁగాక సర్వమును గాలచక్రముమీద నున్నది.

గీ॥ దినముపట్టంగ మూర్ఖుఁడౌ జనునికైన। మట్టిముట్టిన బంగారుపట్టమగును
దినమురాకున్న, తనకెంత తెలివియున్న। మట్టియైపోవు బంగారుముట్టుచున్న॥

(సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుముఖా! ప్రాతఃకాల్య కృత్యాములగుటచే భావికార్యమునకు నామనస్సు నన్నుఁ ద్వరపెట్టుచున్నది.

సుము—గురుచంద్రా! తత్కార్యనిర్వహణమున నాకనంతలాభప్రాప్తి కానుండుటచేతను వారికి బాధానివారణమగుటచేతను నాకు నత్లేయున్నది.

చిత్ర—శిష్యా! వారంతగా నార్తిపీడితులై యుండిరేమి!

సుము—గురువరా! వారిబాధలు మాటలతోఁ జెప్పనలవిగాదు. అయినను వినుఁడు

చ॥ లలితముఖంబులందలి కులంబులు వ్రాలఁగఁ దోలలేక, మై
చెలువము డిందఁ సంకెళులఁ జిక్కిన గంధగజంబులట్లు పే
రెలుగున మూల్గుచున్ మతివిహీనత నుగ్రవనంబునందు బెం
గలఁగొని యున్నవారిఁ గనఁ గానురుదుఃఖము వచ్చె నాకటన్॥

ఇఁక వారివారి దురవస్థలఁ బ్రత్యేకించి వివరించెదఁ జిత్తగింపుఁడు.

సీ॥ పక్వఫలంబులు పరుపుగా నమరంగఁ దలగడ గాహస్తతలములొనర
నుత్తరీయంబుగ నొకకొన్ని యాకులు రాలంగఁ జైతన్యరహితులగుచు
భవదీయమంత్రప్రభావంబుచేఁ జంద్రసేనాభిధుఁడు వీరసేనజుఁడు
వృషకేతుఁడును బ్రాల వెల్లులైతక్కువారలు శోకజలనిధిమునిగిమునిగి
గీ॥ వారిపైఁబడి యేడ్చుచున్నారుతండ్రి! । వృద్ధుఁడౌయాసుమంత్రియు నేకధార
జాలుకన్నీళ్ళమీటుచు దూరువిధిని । రాతిగుండెయు దీనఁగరంగకున్నె?॥

చిత్ర—అట్లయినచో నేనేల జాలివడి వారిని రక్షింపఁగూడదు.

చ॥ నరగణమందుఁబుట్టి విపినంబులఁ జేరి మునీశవృత్తిపై
తిరుగుచుఁ గాయలంబులు సుఁదించుసుఖించిన నాకు జాలియుఁ
గరుణయుఁబుట్టకున్నె వెతఁ గాంచఁగ; భూతమవైననీకెయీ
కరణిమనంబునీరయి యఖండవిచారము లుప్పతిల్లఁగన్॥ కాఁబట్టి,

గీ॥ మధువుకంటెను మధురతామహిమఁ గాంచు। నరుఁడరాతికిఁ బ్రతిదండనంబొనర్ప
నైనశాంతించి నాయంతరాత్మ చేయు । బోధనలగారవించి పాపులనుఁగాతు॥

ఇఁక నీవుపోయి సుఖాసీనులై యుండువారల నిటకుఁదెమ్ము.

సుము—నాకు బహుసంతోషము. ఇఁక పోయి యిటవున్నట్లు వచ్చెద

(నిష్క్రమించుచున్నాఁడు)

[అంతసుముఖుఁడు సవిస్మయులైయున్న చంద్రసేనాదులతోఁ బ్రవేశించుచున్నాఁడు]

చిత్ర—(సుమంత్రుని గౌగలించుకొని)

గీ॥ స్వర్గసుఖభోగియైన మజ్జనకుఁడిపుడు । నన్నుఁజూడంగ వచ్చినట్లున్నదిసుమ

సుమం—(వడకుచు) మేము స్వర్గస్థులతో నే సమానులము

చిత్రి—మిత్రిమా! మరచితే చిత్రకేతుఁడన్ మనుజవిభుని ।
ననుజుచే రాజ్యపదహీనుఁడైనవాని॥

[అందఱు నిశ్చేష్టులై యొండొరు మొగంబులఁ జూచుచున్నారు]

మీరుచేసిన పరమోపకారమునకుఁ బదులుగా నేనొనరించిన యపకృతికి క్షమింపవేడుచున్నాను.

గీ॥ కలుషజలమాలశుద్ధికై కాచునపుడు । ఘటములూరక వానితోఁ గాలకున్నె

కూళలను శిక్ష జేసెడు వేళయందుఁ। గూడ నుండుటచే నిట్లు మూడెఁ గీడు॥

సుమం——మహానుభావా! లోకాతీతమైన యీవిచిత్రములఁ గనుటచే నన్ను నేనె నమ్ముకొనకున్నాను

చిత్ర——మీకట్టి సంశయము వలదు. ఇఁక నాప్రార్థనను వినుఁడు.

చంపకమాల॥ పరమదయాఢ్య! దీనజనబాంధవ! పాయదుగా భవత్కృతా
దరణము, వారొనర్చినయదభ్రభయంకరకృత్యమట్టిదు
శ్చరితులఁ గ్రూరులన్ దురితసంగతులం గనరోషహేతువౌ
కరుణ యొకింత లేక యతిగాఢతమంబున వానలోన భీ
కర మృగసంకులంబయిన కాఱడవిన్ బడఁ జేసి గోముగాఁ
బెరుగుచుఁ జంటిపాలయిన వీడని బిడ్డను నాకుఁ దోడుగా
వెలుపలఁ బాలుచేసి ప్రతివీరుసహాయము చేమదీయరా
జ్యరమహరించినట్టి యురుసాహసుఁడీ వృషకేతు పాపిసో
దరుఁడని రాజ్యభారమును దాల్పఁగ నేఁ గరుణింపనింతఁ గాఁ
గరచెను బాము; తమ్ముఁడని గారవమారఁగఁ జెప్ప సిగ్గగున్
గురువర? పాపకార్యములఁ గోటిగుణంబులు చంద్రసేనసో
దరుఁడధికుండు వీనికి; నెదన్ మఱపొందితె? నిన్న మీరుని
ద్దురగొన వీరలిర్వురును దోడయి మేలొకని యందుమంచు భీ
కరనిశితాసులం గొనుచుఁ గంఠములం దెగఁగోయ నెంచఁగా
నెఱిగి సుషుప్తినుండి మిము నిర్వుర లేవఁగఁ జేసినాఁడు, బా.
మరమతిఁ జంద్రసేన! నన్ను మాలతినిన్ దయవీడి యింతఁగా
నరయుటచేత నీవిటుల నంతవిపత్తులనందవచ్చె; మై
మఱువకుమింక; వీడుజడిమంబు; క్షమించెద నైన దయ్యెను
స్థిరతరసౌఖ్యసంపదలఁ జేకుఱ మీపురసీమఁ జేరనం
దఱు తరలంగ నయ్యెడి; మనంబున దుఃఖములం ద్యజించి యీ
శ్వరకృపఁ జెందుఁడీ! యతఁడె చక్కనజేసెడు నెల్లకార్యముల్॥

[అందఱు కన్నీళ్ళుఁ దుడిచికొనుచుఁ బశ్చాత్తాపహృదయులగుచున్నారు]

చిత్ర——(తనలో) గీ॥ తమము హరియించి రాత్రియంతయును బాయ

బాలసూర్యోదయంబు వికాసహీన
మైనరీతిని వీరి యజ్ఞానజడిమ
పడచి వెలుగొందు నాత్మమైయలరుబుద్ధి॥

(ప్రకాశముగా) సుముఖా! నీవు బోయి సేనీయరణ్యదేశమునకు వచ్చినపుడు ధరించిన వస్త్రాదికములఁ గొనితెమ్ము.

సుము—చిత్తము. [నిష్క్రమించి తిరిగి వస్త్రాదికములతోఁ బ్రవేశించుచున్నాఁడు]

సుము—(తనలో) గీ॥ సుమములానెడు తుమ్మెదగములఁబోలె
పాదపావళిపైవీచు పవనమట్టు
లడవిఁజరియించునట్టి సింహంబుకరణి
నలరెదనునింక స్వేచ్ఛావిహారబుద్ధి॥

(ప్రకాశముగా) గురువరా! ఇదె తెచ్చినాఁడను.

చిత్ర—శిష్యా! ఇవినాకు ధరింపఁజేసి (రహస్యముగా) దుర్యోఖాదులఁదెమ్ము.

సుము—చిత్తము (అట్లుచేసి పోవుచున్నాఁడు.)

సుమం—చంద్రసేన! వీరు చిత్రకేతులనుటకు సంశయమేమి?

వృష—ఏమియు సంశయములేదు

చంద్ర—నిజమే? ఏమియు సందియము లేదు.

వృష—సోదరా! నేనిదివరకు బుద్ధిహీనుఁడనై యొనర్చిన ఘోరకృత్యములక్షమించి మాయందఱ సంశయము దీరునట్లు మీవామహస్తమున ననామికాంగుష్ఠముల మధ్యనుండెడు పుట్టుమచ్చను మాకుఁజూపఁ బ్రార్థించెద.

చిత్ర—వృషకేతూ! నీపశ్చాత్తాపమేచాలు. మీసంశయము దీరునట్లు నాపుట్టుమచ్చనిదిగో చూడుఁడు. (చూచి యాశ్చర్యపడుచున్నారు)

గీ॥ మాటగురుతును నడిచెడు నాటి, నాన । నంబునందలి చిహ్నాలు నమ్మకంబు
చేయలేవయ్యె, నీవట్టె చేయఁగలిగె । దిట్టవై మేలుచేసితి పుట్టుమచ్చ!॥

చంద్ర—మహారాజా! మాసంశయములన్ని యుఁదీరెను- మాయాతప్పులన్నియు క్షమింపనిదెయొక్క మ్రొక్కుగా మ్రొక్కుచున్నాఁడను.

చిత్ర—చంద్రసేనా! నాగ్రహచారవశమున మీకప్పుడట్టి దుర్బుద్ధి వొడమెనుగాని మీరందఱు సహజసుగుణమూర్తులు.

చంద్ర—(చేతులందుకొని) ఈవిపద్దశలోననంత సుకుమారుఁడగు నాకుమారు వసంతుఁ గోలుపోయితిని.

చిత్రి—(దుఃఖమభినయించి) అయ్యో! ఎంతపనిజరిగెను- దిక్కులేని నాకుఁగొంచెము ప్రాపుగానుండు నాముద్దులకూతు మాలతియనుకన్య నాసంపర్కమువీడి యన్యథాయయ్యె.

చంద్ర—(కన్నీళ్ళతో) అన్నా! మాలతీవసంతు లిర్వురు వంగదేశ మహారాజరాజ్ఞు లగుదురనుకొంటిని- ఏమి యీకాలవైపరీత్యములు; మీరలెట్టులిక్కడనివసించుచుంటిరి?

చిత్రి—చంద్రసేనా! అట్లు మీచే రాజ్యపదభ్రష్టుఁడనై యీయడవిఁజేరి నామంత్రపాటవముచే నిక్కడి స్వల్పపిశాచగణమునకుఁ బ్రభువనై కాలము గడపుచుండ నేటికి మీరాక సడిగ్రహించి మాయామృగముఁ గల్పించి మిమ్ము నొప్పించి కడకు జాలివడి యిటులరప్పించితి- ఇఁక మనమందరము గలిసి పరమాద్భుత రసావహమైన యింకొక చిత్రము గనఁబోదమురండు.

చంద్ర—చిత్తము- సుమంత్రీ! కూడరండు.

సుమం—ఇదె వచ్చుచున్నాను. (అందఱు నిష్క్రమించుచున్నారు)

ప్రదేశము. ii కేళికాభవనము.

(చతురంగము నాడుచున్న మాలతీవసంతులఁ జేరువ చిత్రకేతుఁడు మొదలగువారు ప్రవేశించుచున్నారు.)

మాల—(కాయలు గలుపుచు) మనోహరా! ఆటలోనన్ను మాయచేయకుఁడు.

వసం—ప్రేయసీ! గీ॥ రంగజయలక్ష్మిబోలు సారంగనయన
రంగదురుహర్షవై చతురంగమాడు
నీకుబన్నంబు నే నెట్లు నేర్తుఁజేయ
నీయిలాతలమెల్ల నే నేలనున్న॥

మాల—(నవ్వుచు) ప్రాణేశ్వరా! నీవు పలకమీఁదఁ గాయలను సరిగా డాలింపక వ్రేళ్ళమీఁదఁబేర్చి దొల్లించుటలేల?

వసం—హరిహరీ! యట్టి యబద్ధము లేలయాడెదవు.

చంద్రి—(ఆశ్చర్యముతో) నావసంతకుమారుఁడడుగో! నాభాగ్యరాశియదిగో! తొలుకరి మెరుపుంబోలు నొక తరుణీమణితో నెత్తమాడుచున్నాఁడు.

సుమం—(సంభ్రమముతో) అవును! మహారాజ! అవును. ఏమి యీచిత్రములు.

చంద్రి—(చేరువకుఁ బోవుచు)

క॥ తనయుఁడని యెఱుఁగుమనుమా। నినితో నెత్తమ్ముఁగలాడు నేర్పెఱుగుదునీ
తనిమనుగడ సత్యంబో। తనయుని నింకొక్కమారు ధరఁదాఁ గనుటయో॥

వసం—(తలయెత్తి) ఓహో! ఏమినాభాగ్యము. నాపూర్వపుణ్యఫలమగు చంద్రసేన మహారాజు నాకుఁ గన్నులపండువు సేయుచున్నాఁడు. సుమంత్రి మంత్రిపుంగవుఁడదుగో! అదిగో తక్కుంగల పరిజనము. (అని తండ్రికి మ్రొక్కుచున్నాఁడు)

చంద్ర—(లేవనెత్తి కౌఁగలించికొని)

గీ॥ తండ్రి! ధన్యుఁడనైతి నాతపముపండె। నాదునోములుఫలియించె నాకులంబు
వన్నెకెక్కెను సద్గుణావాస! యిటకు। నెట్లు చనుదెంచితివో వివరింపుమన్న!

చిత్ర—ఆచరిత్రయంతయు వ్రాక్రుచ్చినచోఁ గాలాతీతమగును- ముందు పని చూచుకొందము- మిత్రులారా! చూచితిరా! ఇదె మాముద్దులకూతు మాలతియనుకన్య. మాలతీ! ఇటు రా- పరమోపకారియగు సుమంత్రి నొకసారిఁ జూపుమంటివిగదా! ఆతని సందర్శించి యాతనికిఁ జంద్రసేనాదులకును మ్రొక్కుము.

మాల—(సిగ్గుతోఁ దనలో) ఇదియంతయు మాయాప్రపంచకముగా నున్నది.
(అట్లు చేయుచున్నది)

చంద్ర—మంగళదేవతఁబోలు నో బాలామణీ! నీకుఁ గళ్యాణమగుఁగాక.

సుమం—కన్యామణీ! నీకు మనోరథ సిద్ధియగుఁగాత!

చంద్ర—వసంతసేనా! ఇటురమ్మా- నిన్ని రెండుదినములు చూడమి నాకళ్ళు కాయలుగాచినవి- నాకు రెండుయుగములవలె నున్నవి- నీవెంత దుఃఖించితివో.

వసం—నాపడినదుఃఖము పరమేశ్వరునికిఁ దెలియును- అయినదయ్యె- నాజనని నాకొరకై త్వరపడుచుండును- మననింటికిఁ బోవలెను.

చంద్ర—మంచిది. మహారాజా! మన కులవిరోధములడుగంటునట్లు మనమిరువురము వియ్యములందఁ నాకు మనసయ్యెడి

చిత్ర—చంద్రసేనా! నాకుఁగల వేరుకోరికలేమి?

చంద్ర—అట్లయినచో మంగళదాయకమైన యీస్థలమునందు గాంధర్వవిధిగాఁ బెండ్లిచేసి పిదప వసంతరాజాధిరాజప్రదర్శితవైభవోపేతంబుగా మనరాజధానియందుఁ గొనసాగింతము.

చిత్ర—మంచిది వలయు సన్నాహంబుల నెరవేర్పఁ జేయుదును.

(అంత మలినార్ద్ర వస్త్రములతో నున్న దుర్ముఖాదులతో
సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చిత్ర—సుముఖా! నీవు పోయి యాశ్రమ భూమినంతయుఁ గల్యాణమహోచితము
గా నలంకరింపఁ జేయుము.

సుము—పరమసంతోషము (నిష్క్రమించుచున్నాఁడు)

చిత్ర—చంద్రసేనా! వీరలిర్వుర నెఱుగుదువా?

చంద్ర—(చూచుచు) మనభటులా యేమి!

వీర—అవును సందియమేమి. వీరు విలంబుఁడును మైరేయుఁడును.

చంద్ర—ఓరిపశువులారా! ఎక్కడనుంటిరిరా!

చిత్ర—చంద్రసేనా! ఆమూఁడవవాఁడు నాకవిధేయుఁడగు శిష్యుఁడు. వానిపేరు
దుర్ముఖుఁడు. వీరు ముగ్గురు కలిసి నా ప్రాణము తీయ యత్నించియుండ నేగ్రహించి సుముఖునిఁ బంపి దుర్గంధకూపమందు వైచి యిప్పుడిటు తెప్పించితి.

చంద్ర—మంచిపని చేసితిరి.

చిత్ర—దుర్ముఖా! ఇఁకనీవు వారిఁగొంపోయి శుభ్రదేహులఁ జేసియాశ్రమభూమిదగ్గర
నుంచుము. మీకు సంతోషము కలుగుగాక.

దుర్ము—చిత్తము (మైరేయవిలంబులతో నిష్క్రమించుచున్నాఁడు)

(సుముఖుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుము—గురువరా! వివాహశాల చిత్రచిత్రముగా నలంకరించి కన్నులపండువుగా
నొనర్చితిని. మన మనోరమాకళావతులు రంగవల్లులతో ముగ్గుల నిండించి తమ
నైపుణ్యముల నెరపిరి.

చిత్ర—మేలు. మాలతీవసంతుల నడిపించుకొని ముందునడువుము. చంద్రసేనా!
ఇఁక మనయాశ్రమభూమికిఁ బోయి యటనుండి యీదినముననే మనపట్టణమును
సుఖముగాఁ బ్రవేశింతముగాక

చంద్ర—చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము iii చిత్రకేతుని యాశ్రమమునొద్ద వివాహశాల.

చంద్ర—(ఆశ్చర్యముతో) ఆహా! ఏమి యీవివాహశాల!

చం॥ చిగురులఁ దోరణంబులు రచించిరి; నేడఁగిరేకుపందిరిన్
సొగసుగఁగట్టిరుల్లసితసూన వినిర్మితకందుకాళి వ్రే
లఁగఁ బచరించిరెల్లయెడలన్నవచంద్రశిలావితర్దులిం
పుగ నొడగూర్చి చల్లిరి ప్రపూతసుగంధ హిమాంబుపూరముల్॥

సుము—ఓహో! ఈశృంగారవివాహశాల స్వర్గ భవనమువలెనున్నది.

చంద్ర—(వేదికమీదనున్న మాలతీ వసంతులఁగాంచి)

మ॥ పరమాభీష్టదమై వధూవరతనూభాభాసితంబై శుభా
కరమై యిష్టజనానుషంగవిలసత్కల్యాణమై కిన్నరీ
తరుణీగానసమానగానలసితోత్సాహంబునై పేరలం
కరణంబొప్పు వివాహవేదిక సమగ్రశ్రీవిరాజిల్లెడిన్॥

వీర—మహానుభావుఁడైన యీచిత్రకేతుని చిత్రములనంతములు.

గీ॥ సృష్టిని హసించు ప్రతిసృష్టిచేయఁగలుగు । చిత్రకేతునిచిత్రముల్చెప్పఁగలమె ?
ఐంద్రజాలికుచేతి మాయలనుబోలు । చోద్యములఁజూపుచున్నాఁడు చూపఱకును॥

చంద్ర—(మనోరమా కళావతులఁజూచి) గాంధర్వస్త్రీలఁబోలు నీసతులెవ్వరో !

ఉ॥ వీణెలిగిర్చినట్లువయివ్రేళ్ళమరన్ ధవళారవిందశు
భ్రాననసీమపైనభినయంబులు గ్రాలఁగ షడ్జమస్వరా
మానసుఖానురక్తిని మయూరములాయ్యనఁజేరియాడనీ
మానినులుంద్రు శారదలమాడ్కి వచింపుము వీరలెవ్వరో॥

చిత్ర—చంద్రసేనా ! వీరలిరువురేవనసంజాతలగు బోయకన్నెలు. చిన్ననాటనుండి మామాలతికిఁ దోడుజేసి మనోరమాకళావతులని పేరుపెట్టి సంగీత సాహిత్యకళా ప్రవీణలగా నొనరించి నాగరికగుణంబులలవడఁజేసితి.

చంద్ర—ఓహో ! వీరిరూపములు గుణములు విద్యావైభవములు నాదరణీయములు.

చిత్ర—ఇఁక కాలవిలంబనమేల ? మాలతీవసంతులారా ! మీరత్నఖచితాంగుళీయకములనొండొరుల కూర్చికొని యాపుష్పరాసులఁదలఁబ్రాలుగాఁజేసి కొనుఁడు

(మాలతీవసంతులట్లుచేయుచున్నారు.)

చంద్ర—మైత్రేయా ! నీవు వేదికకడకుఁబోయి చక్కనిసామగానము చేయుము.

మైత్రే—రాజోత్తమా ! సంభావనలేని యీవృథాప్రయోజనములతోఁ బనిలేదు.

చిత్ర—బ్రాహ్మణోత్తమా ! వేటమిషచేత భగవంతుఁడు నిన్నిపనికై యిటకుఁదెచ్చి నాఁడు పురప్రవేశమైన వెనుకనీవు సత్కరింపఁబడుదువుగాక.

మైత్రే—చిత్తము (అట్లుచేయుచున్నాఁడు)

చిత్ర—మాలతీవసంతులారా ! మీరిద్దరిఁక లేచి వేరువేరుగా వీరలకు నమస్కరింపుఁడు

చంద్ర—(మ్రొక్కుచున్న దంపతుల స్పృశించి)

గీ॥ పుత్రపౌత్రాభివృద్ధిగాఁ బాలతిమిన్న । వరునిఁగూడి సుఖించిసంపదలఁబొదలు
నన్నపూర్ణకు నుద్దియై యన్నదాన । గరిమఁగాంచును మాలతీ కన్య, మాన్య॥

సుమం—(వందనములఁగొని)

గీ॥ అరఁటిపిల్లల తరమట్టులన్న! నీదు । వంశవల్లిను జిరవృద్ధివఱలుఁగాత
ధనకనకవస్తువాహనోత్కరముతోడఁ । బెద్దకాలంబు సుఖతజీవించుఁగాత॥

చిత్ర—చంద్రసేనా! ఇప్పుడు జాముప్రొద్దెక్కినది. ఇఁకమనము ప్రయాణసన్నాహము మీఁదనుండఁగోరెదను

చంద్ర—మహారాజా! మాకందఱకు నదియేగదా కోరిక.

చిత్ర—(కన్నీళ్ళతో) చంద్రసేనా! ఎన్నికష్టములకైన నోర్చి చిన్ననాటనుండి గోముగాఁబెంచిన మామాలతిని నేటినుండి మీయధీనము చేయుచున్నాను. మీయింట నేవిథమైన కొరతలేకున్నను పితృప్రేమగలవాఁడనగుటచే నాకొకవిథమైనజాలియు బెంగయుఁ గలుగుచున్నది.

చంద్ర—భావగారూ! మీకట్టిభయమువలదు; దంపతులిర్వురు కొన్నిదినములు మాయింటఁగొన్నిదినములు మీకడనుండుచుందురు.

చిత్ర—(కన్నీళ్లతో) మాలతీ! ఇటురా! నేటినుండి నీవనునిఁగూడి చిరకీర్తిఁగలుగఁ బ్రవర్తింపుము నేనుగళాన్వితవైననీకు బోధింపవలయునదిలేదుగాని యిదమాత్రము వినుము.

చం॥ ఉదయమునందులేచి సమయోచితకృత్యములెల్లఁదీర్చి పెం
పొదవఁగనత్తమామలకు నూర్జితభక్తినిమ్రొక్కి నిత్యభో
గదుఁడగుభర్తకంజలిడఁగావలెనమ్మరొ సేవకాళిపై
నదయవుగమ్మ సద్వికచసారసపత్రవిశాలలోచనా!

చం॥ కలిగినదాననంచుమదిగర్వము జెందకుమాకుమారి! చు
ట్టలు నిరుపేదలైనవికటంబుననుండక వారితోఁగనుల్
గలిసిమెలంగవమ్మ; యుపకారమతిన్ జరియింపవమ్మయీ
కలుములశాశ్వతంబులగు గౌరవమేకలకాలముండెడిన్. ఇదికడుశ్రద్ధగావినుము

చం॥ పతియెపుడైననిన్నహితభాషలనాడిననోర్చియాతనిన్
బ్రతివచనంబులాడక యుపాయమతిన్ గరగింపవమ్మదై
వతమనినమ్మమమ్మ పరివారలలోనురుకీర్తితేజము
న్నతిఁగనుమమ్మ నీవలననాకుయశంబుఘటింపుమమ్మరో!

మాల—వినయవిధేయనై తమయిష్టప్రకారము ప్రవర్తింతునుగాక.

చిత్ర—వసంతా! ఉ॥ నేరములున్ననోర్చిసతినిన్ హితబోధలసత్పథంబునన్
జేరిచిసర్వసౌఖ్యములఁజెందుమి రాజ్యభరంబుదాల్చినీ
వైరిగణంబుద్రుంచియనివారితకీర్తివహించిమించియీ
ధారుణినేలిసర్వకులధర్మములన్ గనిపెట్టుమెంతయున్.

వసం—భవదీయాజ్ఞాబద్ధుఁడనై సంచరించెదను

త్రి—సుముఖా! ఇఁకనీవుమమ్ముఁవీడి స్వేచ్ఛతో విహరింపుము.

సుము—చిత్తము ఇదె నే సెలవుగొనుచున్నాఁడను.

త్రి—మంచిది దుర్ముఖా! నీయపరాధముల క్షమించి నీవనము నీయధీనము చేయుచున్నాఁడను. ఇటనుండి బుద్ధిగలిగి వర్తింపుము

దుర్ము—చిత్తము

త్రి—మాలతీ! ఈమనోరమాకళావతులనీచెలికత్తెలఁగా గ్రహించికూడఁగొనిపొమ్ము

మాల—మంచిది పరమాభీష్టము.

విత్రి—చంద్రసేనా! ఇఁకమీకుఁగావలయునదియేమి?

చంద్రి—మహారాజా! ఇఁక నేమికావలెను.

మ॥ విజయోత్సాహమునంజెలంగితిని మీవియ్యంబునుంబొందితిఁ
బ్రజలంజేరితినాకుమారుఁగని; నంపద్భాగ్యయోగాన్వితన్
రజనీకాంతముఖీలలామసుషమ్మైరాఁగంటినింకేల? నా
కుజగన్మంత్రకళావిశారద! పరుఁగోర్కుల్ ప్రసాదింపఁగన్ ॥అయినను

ఉ॥ మంగళమయ్యెడున్ బ్రజకమందరతిన్ధర నేలుగాతను
త్తుంగయశంబునన్నరపతుల్; శుభమందెడు గాతగోద్విజుల్;
రంగదభంగసౌఖ్యముల రంజిలుతన్ గవిసార్వభౌములు
ప్పొంగుచు సర్వసస్యముల భూనతిపెంచుత జీవకోటులన్.

విత్రి—తథాస్తుయగుగాక ఇఁకనామంత్రిసిద్ధులవిడుచుచున్నాను.
మనమందరమిఁకముందు వంగదేశమునకుఁబోదముగాక

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య. ఇది శ్రీమద్రమారమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానూనానురాగసూరమాంబావేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప తురగాన్వయాంభోధిసుధానిధాన వేంకటాచలాభిధానప్రణీతంబయిన మాలతీవసంత నామనాటకంబునందు సర్వంబును పంచమాంకము

# శుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | నోరుం | నోరిం |
| ,, | 18 | మాంధ్రవధూటి | మాంధ్రభాషావధూటి |
| 2 | 2 | నాంధ్రవధూమణిని | నాంధ్రభాషావధూమణిని |
| ,, | 4 | మత్రికి | మంత్రికి |
| ,, | 6 | పట్టమున్వడసి | పట్టమున్బడసి |
| 3 | 18 | కేళి | కేళీ |
| 5 | 1 | వసంతుఁడు | వసంతుఁడు మైత్రేయుఁడు |
| 7 | 6 | హాలాహాలము | హాలాఫేనము |
| 8 | 7 | వర్తులమునన్ | వర్తులతనున్ |
| 9 | 25 | జర్ఝరిత | జర్జరిత |
| 14 | 20 | జార్చు | జారు |
| 15 | 6 | ఉడుపపునాకు | ఉడుపమవీవు |
| 32 | 22 | వెఱ్ఱ | వెఱ్ఱి |
| 34 | 4 | ఎందఱా | ఎందరా |
| ,, | 21 | అడరుచు | అడలుచు |
| 38 | 8 | లెవఱు | లెవరు |
| ,, | 9 | ఎవఱి | ఎవర |
| 45 | 1 | యెడయెడ | యెడనెడ |
| 46 | 18 | మూపుఁబయి | మూపుపయి |
| 51 | 4 | వాఁదోడు | వాదోడు |
| 53 | 8 | కావించెనో | కావించెనో యట్టుల |
| 64 | 19 | యుంటిని | యుంటిసి ని |
| 74 | 13 | జక్కని | జిక్కని |
| 76 | 15 | దలి కులంబులు | దలికులంబులు. |
| 79 | 18 | ననామికాంగుష్ఠముల | ననామికాకనిష్ఠములు |